# వాసవదత్త





శిరోమణి
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

తొలికూర్పు
౨౦౦ ప్రతులు
వెల ౧-౦-౦



Printed by I. V. Ratnam, M. Sc.
At the Andhra Grandhalaya Press,
BEZWADA, 1944.



ప్రాప్తిస్థానము:
శిరోమణి
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి,
44 జీరా
సికింద్రాబాద్, (దక్కన్)

# భూమిక

భాసమహాకవి రచించిన ప్రతిజ్ఞాయౌగంధరాయణ నాటకము నందలి యితివృత్తమే నా వాసవదత్తకు మేలుబంతి. కాళిదాస మహాకవి తన మేఘసందేశమున "ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే" అనియు, "ప్రాప్యావంతీ ముదయనకథా కోవిద గ్రామవృద్ధాం" అనియును నీకథను దాఁకి విడుచుటచే నాతనికాలమున లోకమున దీనికిఁగల గౌరవము వ్యక్తమగుచున్నది. మఱియు సంస్కృత వాఙ్మయమున వత్సరాజనాయకమగు రూపకచతుష్టయము (౧ ప్రతిజ్ఞాయౌగంధరాయణము, ౨. స్వప్నవాసవ దత్తము. ౩. రత్నావళి, ౪. ప్రియదర్శిక) కలదు. దీనిచేఁ గవులకును బాఠకులకునుగూడ వత్సరాజ కథయందలి యభిరుచి మెండని విశదమగుచున్నది ఇందు, ప్రతిజ్ఞా యౌగంధరాయణ కథాతంత్రమే కీ. శే. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయమునకు మూలము. ఆ యౌగంధరాయణుఁడే యిందు యుగంధరుఁడుగాఁ బరిణమించెను.

పై నాలుగు రూపకములలోఁ బ్రతిజ్ఞాయౌగంధరాయణమే మిగిలిన వానికన్న మిన్నయని నా తలంపు. ఏలన మిగిలినవన్నియుఁ గేవల శృంగార ప్రధానములు. ఇందు శృంగారము ప్రధానమైనను వీరము, హాస్యము, బీభత్సము, భయానకము మొదలగు నితరరసము లంగములై ప్రధానరసమును బోషించుచున్నవి. మఱియుఁ బూర్వకాలమునందలి రాజకీయతంత్రమునకిది దర్పణము. కాముకుఁడగు రావణుఁడు సీతాదేవి నపహరించుకొని పోయెనన్నచో వింతలేదు. కాని ప్రద్యోతుఁడు శత్రువగు వత్సరాజును దన గౌరవమునకు భంగమురాని విధమున నల్లునిఁగాఁజేయుఁ దలంపుతో నపహరించికొని వచ్చు

తొలి కూర్పు
౫౦౦ ప్రతులు
వెల ౧-౦-౦



Printed by I. V. Ratnam, M. SC.
At the Andhra Grandhalaya Press,
BEZWADA, 1944.



ప్రాప్తిస్థానము:
శిరోమణి
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి,
44 జీరా
సికింద్రాబాద్, (దక్కన్)

# భూమిక

భాసమహాకవి రచించిన ప్రతిజ్ఞాయౌగంధరాయణ నాటకము నందలి యితివృత్తమే నా వాసవదత్తకు మేలుబంతి. కాళిదాస మహాకవి తన మేఘసందేశమున "ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజో౽త్ర జహ్రే" అనియు, "ప్రాప్యావంతీ ముదయనకథా కోవిద గ్రామవృద్ధాం" అనియును నీకథను దాఁకి విడుచుటచే నాతని కాలమున లోకమున దీనికిఁగల గౌరవము వ్యక్తమగుచున్నది. మఱియు సంస్కృత వాఙ్మయమున వత్సరాజనాయకమగు రూపకచతుష్టయము (౧ ప్రతిజ్ఞాయౌగంధరాయణము, ౨. స్వప్నవాసవదత్తము. ౩. రత్నావళి, ౪. ప్రియదర్శిక) కలదు. దీనిచేఁ గవులకును బాలకులకునుగూడ వత్సరాజ కథయందలి యభిరుచి మెండని విశదమగుచున్నది ఇందు, ప్రతిజ్ఞా యౌగంధరాయణ కథాతంత్రమే కీ. శే. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయమునకు మూలము. ఆ యౌగంధరాయణుఁడే యిందు యుగంధరుఁడుగాఁ బరిణమించెను.

పై నాలుగు రూపకములలోఁ బ్రతిజ్ఞాయౌగంధరాయణమే మిగిలిన వానికన్న మిన్నయని నా తలంపు. ఏలన మిగిలినవన్నియుఁ గేవల శృంగార ప్రధానములు. ఇందు శృంగారము ప్రధానమైనను వీరము, హాస్యము, బీభత్సము, భయానకము మొదలగు నితరరసము లంగములై ప్రధానరసమును బోషించుచున్నవి. మఱియుఁ బూర్వకాలమునందలి రాజకీయ తంత్రమునకిది దర్పణము. కాముకుఁడగు రావణుఁడు సీతాదేవి నపహరించుకొని పోయెనన్నచో వింత లేదు. కాని ప్రద్యోతుఁడు శత్రువగు వత్సరాజును దన గౌరవమునకు భంగమురాని విధమున నల్లునిఁగాఁ జేయుఁ దలంపుతో నపహరించికొని వచ్చు

టయు, వత్సరాజు యౌగంధరాయణ సాహాయ్యమున వాసవ దత్త నపహరించికొని పోవుటయు రాజకీయ తంత్రముయొక్క పరాకాష్ఠయన వచ్చును. కాంతాపహరణములను విందుము. కాని యిట్టి పురుషాపహరణములు వినము. ఇట్టి దాని నుద్దే శించిన యా కాలపు మంత్రిబుద్ధిప్రభావము దురూహము. ఇట్టి సందర్భములు గలదగుటచేతనే కాళిదాసమహాకవియు దీనినిఁ బ్రశంసింపకుండ నుండలేక పోయెను.

ప్రతిజ్ఞా యౌగంధరాయణము 'దీనికి మూలమైనను "స్త్రీతినామాఽపి మధురం" అని యుంటచే 'వాసవదత్త' యని మార్ప సాహసించితిని. ఇందలి కథమాత్రము భాసునిది కావ్యపద్ధతి యంతయు స్వతంత్రమే.

కోరి యీ కావ్యము నాచే రచింపఁజేసి యంకితముగాఁ గొని నా కైదు నూటపదారులును, అమూల్యవస్త్రములను బహూకరించి భాషాభిమానమును, వదాన్యత్వమును బ్రక టించిన శ్రీ శ్రీ శ్రీ పారలపల్లె వేంకటరామిరెడ్డిగారినిఁ బర మేశ్వరుఁ డాయురారోగ్యములనిచ్చి రక్షించుఁగాత! వీరి పిన తండ్రిగారగు శ్రీ మరిపీటి శంకరరెడ్డిగారితఃపూర్వము నాచే నీ విధముగనే "జానకీపరిణయమును" రచింపంజేసి పై విధము ననే సత్కరించిరి. భాషాభిమానమునకును వదాన్యత్వమునకును రెడ్లు మొదటినుండియుఁ బుట్టిండ్లుగదా! 'యథాబీజం తథాం కురం' అన్న విధమున నట్టి రెడ్డివంశమునఁ బుట్టినవాఁడు మా వేంకట రామిరెడ్డి. ఈ రెడ్డి వతంసుఁ డింకను మహాకవులచేఁ బెక్కుకావ్యములను రచింపఁజేసి యంకితము గొని దీర్ఘాయు ష్మంతుఁడై, కవికల్పకమై, సత్కీర్తినిఁ బడయుఁగాత!

గ్రంథకర్త.



కృతిపతి : శ్రీ శ్రీ శ్రీ వేంకటరామారెడ్డిగారు



పారలపల్లె, ఆదోని తాలూకా, బళ్లారి జిల్లా.

శ్రీ పరదేవతాయై

## వంశ్యావళి



శ్రీమదలమేలు మంగా
రామావర! వేంకటేశ్వరా! యమరస్వా
మీ! మా వేంకటరామ
తక్ష్మామండనుఁగావు మొసఁగి కల్యాణంబుల్. ౧

శ్రీకన్యా కుచమండలాంతర సర శ్శ్రీరాజహంసంబు, క్షో
ణీ కాంతాధరబింబకీరము, లసన్నీలా నితంబస్థలీ
శ్రీకాంచీవలయంబునై మెరయు శ్రీకృష్ణుండు మాయుత్తమ
శ్లోకుఁ వేంకటరామిరెడ్డివిభు నాలోకించుతన్ సత్కృపన్.

అలపువ్విల్తు జయించి చిత్తముఁబరాయత్తంబుఁగావించి య
గ్గలపుంబింకముఁబూనియుం దుదికి నొక్కర్తుం దలందాల్చి య
న్యలతాంగిన్నదికించి గాత్రమున నాహ్లాదించు శ్రీశంభుఁ డ
ర్మిలి మా వేంకటరామిరెడ్డి కిడుతన్ శ్రేయం బమేయంబుగన్.

పరమచ్ఛాందసుఁడయ్యు వృద్ధుఁడయియుం బల్లుంబువుం బోఁడినిం
దరుణీరత్నముబుగ్గఁబెట్టుకొని తాఁ దాంబూలముం బోలెఁ, జూ
పఱకుఁ నవ్వును బత్తియుం గొలుపు నాపద్మోద్భవుం డాచితా
దరుఁడై వేంకటరామ భూపతికి భద్రంబుల్ ప్రసాదించుతన్.

మును రెడ్డివంశములయం
దనఘుంబయి బత్తులాన్వయము తరుకాండం
బునఁ గల్పవృక్షమట్టులు
పొనరుం బళ్లారి సీమమున సంభవమై. ౫

ఆ వంశోద్భవు లెల్లవారలును స్తుత్యంబౌ చరిత్రింబునన్, దేవబ్రాహ్మణ గోగణంబుపయి భక్తిశ్రద్ధలన్, భారతీ సేవాతత్పరతన్, నిరంతర జగజ్జేగీయ్యమాన ప్రథన్ ఈవిశ్వంభర మేలుబంతులయినారీనాఁటికిన్ రెడ్లలోన్. ఇ

బత్తులవారి కెల్ల సిగబంతి యటంచును, గీర్తి తేజముల్ గుత్తకుఁ గొన్న పెద్దయని, కోవిదకోటికి మేరువంచు, స ర్వోత్తముఁడంచుఁ దన్నుఁజూచి యుర్విని నెల్లరు సన్నుతింప స ద్వృత్తుఁడుమున్న వర్తిలెను వేంకటరాయఁ డగణ్యపుణ్యుఁడై

ఆతం 'డైజ'ను రాజధానిగను రాజ్యంబేలుచున్ వీర్య వి ఖ్యాతింబొల్చి నిజాము దేశమున నా గద్వాల విశ్వంభరా నేతృండై తగు సోమభూవరునితో నిర్నిద్ర తేజః ప్రభా భూతింబెద్దయుఁబోరి వీరశయనంబుంబొందె యుద్ధంబునన్.

శ్రీ వేంకటరాయనికిని
దేవేంద్రునికిం జయంతు తీరునఁ దిమ్మ
క్ష్మావరుఁ డుదయించెను గుణ
సేవధి విద్యాచణుండు శ్రేష్ఠుఁడు నడతన్. ౯

తమ పంటపండెనని కవి
సముదాయము సంతసించె; శాత్రవతతి డెం
దములందు రాయివడెఁ ది
మ్మ మహీపతి గద్దెనెక్కు మాత్రిన బళిరా! ౧౦

ఆ పతికి దాసిరెడ్డి ధ
రాపతియును రామిరెడ్డి రంగారెడ్డుల్
రూపొందిన కీర్తులును మ
హాపుణ్యులు పుట్టి రత్యుదారులు వీరుల్. ౧౧

ఆ ముష్వు రన్నదమ్ములు
నా మూర్తిత్రితయమునకు నవతారములం
చామోదపడుచు నుందురు
భూమిజనులెల్ల సౌఖ్యములను మునుఁగుచుఁ. ౧౨

స్తవనీయుండగు దాసిరెడ్డి రణమధ్యంబందు నిల్వంగ శా
త్రవ సందోహము కాలరుద్రు నవతారంబో? యితండంచు భీ
వివశత్వంబునగాత్రయష్టితడియన్ స్వేదాంబువుల్ క్రిక్కుచున్
శివపంచాక్షరినిం బఠించు కొనుచుం జేమోడ్పు సేయుందగన్.
చెలికారంబును జూపుచున్ సతతముం జేదోడు వాదోడుగా
నిలువంగాఁ దన సోదరద్వయము నిర్నిద్రింబుగా నెల్ల వెం
టల జ్యేష్ఠుండగు దాసిరెడ్డి కడు శ్రేష్ఠత్వంబు దీపింప సా
ధులలాముండుగ, నేలుచుండెనుభువిన్ స్తోత్రింపఁగా వేలుపుల్.
శ్రీ రామిరెడ్డియును రం
గారెడ్డియుఁ గల్పవహ్ని కల్పులయి మహా
వీరారివంశముల యూ
ర్పేరులు లేకుండఁ జేసిరి మగంటిమినిన్. ౧౫

మగటిమినిఁ జూపఁజాలక
పగతెల్లరు నొక్క కుట్రింబన్నిరి వీరిం
దెగటార్పఁ; బన్ని యట్టులు
పగతురు నెయ్యురుగనై ప్రవర్తిలిరి తగన్. ౧౬

కడు నెయ్యంబున రామిరెడ్డివిభు రంగారెడ్డినిం జెల్మిచా
ప్పడ నాహ్వానమొనర్చి గౌరవముతో వర్తించి కావించి మె
క్కుడు విందున్ నిదురింపవారలు నిసిన్ఘోరాతిఘోరంబుగాఁ
బడుకొన్నట్టి గృహాని కగ్గిడి మృతింపం జేసిరా భ్రాతలన్. ౧౭

కలిగి రలదాసి రెడ్డికిఁ
జెలువుగఁ బెదరంగరెడ్డి చినరంగారె
డ్డులు గోవిందయరెడ్డియు
బలయుతులగు సుతులు ముగురు భాగ్యము కతనన్. ౧౭

గోవిందరెడ్డి బాగమ
దేవినిఁ బెండ్లాడె భాగ్యదేవిని మున్నా
గోవిందుఁడాడినట్టులు
పావనులగు వారిదలఁపఁ బాయు నఘంబుల్. ౧౮

గోవిందరెడ్డి బాగమ
దేవివలన లక్ష్మిరెడ్డి ధీనరుని యశ
శ్శ్రీవరుఁ బెదవేంకట ధర
ణీవరుఁ జినవేంకటావనీపతిఁగాంచెన్. ౨౦

ఆలక్ష్మిరెడ్డిఁ దలఁచుదు
రాలక్ష్మివరుని బింబమని, చల్లని త
త్పాలన సమస్త మంగళ
జాలంబునఁ దేలుఁ దత్ప్రజాతతి బళిరా! ౨౧

అలరెడ్డివంశముక్తా
ఫల మారాజర్షి యేకపత్నీవ్రతుఁ డ
స్ఖలితచరిత్రుఁ డుదారుఁడు
గలఁడె? సరివార లాత్రికాలజ్ఞునకున్. ౨౨

నాగమ యుత్తమగుణ క
ల్పాగమ, దానాంబువులకు నాతొలకరిదా
మేగమ; లక్ష్మిరెడ్డికి
భాగస్వామినియనమ్యో వలపులపంట. ౨౩

పెదవేంకట రెడ్డీందుని
దుదారుఁ డుజ్జ్వలయశస్కుఁ డూర్జస్వలుఁ డు
న్మదపరతృణాగ్నిమై యొ
ప్పిదముగఁ దగెఁ బార్లపల్లె వీటికిఁ బతియై. ౧౪

అందంబునఁ జందంబున
మంది కుదాహరణ మగుచు మహి సీతాదే
విం దలఁపించుచు నరసమ
యందెను సత్కీర్తి యతని కర్ధాంగిగనై. ౧౫

తలఁచుచు నన్నలయానతి
నలసుగ్రీవాజ్ఞగా నిరంతరమును, స
త్కళలన్ విశారదుండయి
వెలింగె మహితుండు చిన్నవేంకటపతియున్. ౧౬

అసదృశ పాతివ్రత్యము,
విస్మృమర శీలంబు, శాంతవృత్తియుఁ, గురు లం
దసమానభక్తియుం దగి
బసవాంబిక యొప్పె నతని భార్యామణియై. ౧౭

అల పెదవేంకటరెడ్డికిఁ
గలిగిరి దశరథుని కట్లు ఘనులు కుమారుల్
నలువురు ప్రజ్ఞావంతులు
బలవంతులు ధైర్య శౌర్య వైభవవంతుల్. ౧౮

గుణసమూహంబున గోవిందుఁ దలఁపించుఁ
బెద్దవాఁడైన గోవిందరెడ్డి
యల ధర్మదేవత యవతార మనఁగ వె
లింగెను బెదరామలింగరెడ్డి

సకల విద్యలలోనఁ జతురాస్యుఁ డనుచుఁ జె
లంగె నడిపిరామలింగరెడ్డి
క్షాత్రతేజోనివాస క్షేత్రమై భాసి
లెను దద్ద చినరామలింగరెడ్డి
పెద్ద వేంకటరెడ్డి పృథ్వీధవునకు
ముద్దు బిడ్డలు నల్వురు పుట్టినారు
దిక్చతుష్టయముం గెల్చు దిట్టతనము
మూర్తిని వహించి యుండిన పొలుపుదోఁప. ౨౯

తనజన్మము తరించెనని మెంచు యాచకుం
డరుదేర నాత్మగృహంబునకును
దనపుణ్యసంపదల్ కనె ఫలంబని మెంచు
జను లాత్మసాహాయ్యమునకు రాఁగఁ
దనకబ్బెఁ బెద్ద నిధానంబని తలంచు
సూరివరేణ్యులఁ జూచు మాత్రి
తినతపంబు ఫలించె ననుచు భావించును
గానంబడంగ సత్కవి వరుండు
తన్నుఁ గోసిమైనఁదత్పరత్వంబునఁ
బరులఁ గొలుచు నట్టి భక్తి గరిమ
రాజిలంగఁ బెద్ద రామలింగారెడ్డి
ధన్యమైన జీవితము వహించె. ౩౦

సారాచారుఁ డుదారుఁ డుజ్జ్వల యశస్సాంద్రుండు శ్రీరామలిం
గారెడ్డీంద్రుఁ డొనర్చినట్టి వడుగుల్ కల్పించు పెండ్లిండ్లునుం
బ్రారంభించిన ధర్మసత్రము లగణ్యంబుల్ సుడీ! యియ్యలం
బేరుం గాంచెను దానకర్ణుఁ డని యీపృథ్వీశుఁ డెం తేనియున్.

పెదరామలింగ భూపతి
ముదమున నారాయణుండు భూశ్రీలవలెం
బొదలెడు వేంకమ నరసమ
లుఁదగంబెండ్లాడె దివ్యలలితాకృతులన్. ౩౨

అలవేంకమ గర్భాబ్ధిఁ
గలానిధియుఁబోలె సుతుఁడు గలిగెను; గనువిం
దులు గొలిపెఁ జుట్టపక్కం
బులకుం దలిదండ్రులకు నమోఘగుణుండై. ౩౩

రామిరెడ్యాఖ్యుఁడైన పుత్త్రకుఁ డితండు
సద్గుణంబుల శ్రీరామ చంద్రుఁ బోలె
నట్టి సుతుఁగన్న తలిదండ్రు లెట్టి ధన్య
తములో యంచును సర్వ బాంధవులు పొగడ. ౩౪

అబ్జ బంధుండు మిట్ట మధ్యాహ్నమందు
గ్రుంకినట్టులు, నేలలోఁ గ్రుంగినట్లు,
కొండ ప్రళయంబు రాకయుఁ, గూలిపోయె
నిరువ దేండ్లకె రామిరెడ్డీంద్రుఁ డకట. ౩౫

నరసాంబా గర్భంబున
హరి దేవకి గర్భమందున ట్లుదయించెన్
సరసుండు లక్ష్మిరెడ్డీ
శ్వరుఁడు ప్రాగ్జన్మ పుణ్య పరిపాకమునన్. ౩౬

తనదు చక్కందనంబును గాంచి స్వైరిణీ
బృందంబు గ్రుక్కిళ్ళు మ్రింగుచుండఁ
దనదు బాహాబలంబును గాంచి శాత్రవ
భటబృంద మాదలల్ వాంచియుండఁ

దనదు వదాన్యత్వమును లెస్స పరికించి
వేలుపువృక్షంబు వెల్లఁబోవఁ
దనదు పాండిత్యంబుఁ గని యర్థులగు బుధుల్
పుంసరస్వతియంచుఁ బొగడుచుండఁ
బుట్టి నిల్లయి సుగుణ సమూహామునకుఁ
బట్టుగొమ్మయి సత్కవివర్గమునకు
మేలుబంతయి రెడ్డి రాడ్జాలమునకు
లక్ష్మిరెడ్డీశ్వరుండు సెలంగు చుండె. ౩౭

భుజియింపఁగాఁ బోఁడు పురినున్న బీదసా
దులు భుజించిన వార్తఁ దెలిసికొనక
గ్రహియింపఁగాఁ బోఁడు కరము రైతులనుండి
ప్రీతిఁ దత్థ్సితి విచారింపఁ బోక
యడుగఁగాఁ బోవఁడయ్యర్థమర్థుల నొకప్పు
డిచ్చినన పునర్గ్రహించుఁగాని
కడపఁగాఁ బోఁడొక్క క్షణమేని రిత్తగాఁ
బెఱల కేమేలొ కావించుఁ గాని
పండుగదినాలలో బీదవాండ్రఁ బిలిచి
విందుల నొసంగుదయఁ; బంచివెట్టుచుండు
నూత్నవస్త్రంబు; లాపరిణూత గుణుఁడు
లక్ష్మిరెడ్డీంద్రు నెవరు పోలంగలారు? ౩౮

తల్లులు లేని వారలకుఁ దల్లియుఁ దానయి ప్రోవు సేయుచున్,
బిల్లలు లేని వారలకుఁ బిల్లఁడు దానయి ముద్దుగూర్చుచున్,
గొల్లయి కుంటివారలకుఁ, గళ్లయి గ్రుడ్డులకున్, సతంబు వ
ర్తిల్లెను లక్ష్మిరెడ్డియు మదీయుఁ డటంచుఁ దలంపనెల్లరున్. ౩౯

ఆమహనీయుఁడు వేంకమ
భామారత్నంబు చెట్టవట్టెను దొలి శ్రీ
రాముఁడు సీతాదేవిని
సామోదము పెండ్లియాడుచందము దోఁపన్. ౪౦

ప్రతిబింబ మాచంద్రమతికి; సావిత్రికి
సద్భుతంబైన మూర్త్యంతరంబు;
దమయంతి కవనిఁ బ్రత్యాదేశభూతంబు;
నపరావతార మాయవని సుతకు;
నూత్నరూపంబు మండోదరీ సాధ్వికి;
నల్ల ఛాయాదేవి కవతరంబు;
వనసూయకక్కయు; నావసిష్ఠమునీంద్రు
తొయ్యలికినిఁ జిన్నతోడఁబుట్టు;
వనుచు వేంకమాంబ నభినుతించు జనంబు
వేయినోళ్లతోడఁ బెద్దతడవు
నామె పేరు దలఁపఁ బ్రాహ్ణాంబులంబాయుఁ
బాపరాశి నిక్కువంబు సుండు. ౪౧

తలలో నాలుకయై సదా కొలుచు చుద్యద్భక్తిమై నత్తమా
మల,ముంగొంగుఁ బసిండియై శ్రితులకున్,మందారమైయాచకా
వళికిం, బున్నెము పంటయై పుడమికిన్ వర్తిల్లెఁబో! సుందరీ
తిలకంబై మను వేంకమాంబసరి ధాత్రిన్ లేరుముమ్మాటికిన్.

వరలక్ష్మి రెడ్డి వెంకమ
పురంధ్రులకు ముద్దుపట్టి పుట్టెఁ గులధురం
ధరుఁడు, వరుఁడు వేంకట రా
మిరెడ్డి సద్ధర్మమునకు మేర యితఁడనన్. ౪౩

ఏవ్వాని ముఖపద్మ మిందిరాదేవికి
భాసురంబైన సింహాసనంబు;
ఎవ్వాని జిహ్వాగ్ర మిలయందు భారతీ
రమణీమణికి నాట్యరంగభూమి;
ఎవ్వాని గాత్రంబు పువ్విలుకాఁడు ము
న్నవతారమెత్తిన యట్టిస్థలము;
ఎవ్వాని హృదయం బనేక కృపార్ఝురుల్
ప్రభవించు శీతల పర్వతంబు;
పృథివి నెవ్వాండు పేదల పెన్నిధాన;
మెవఁడు చుట్టాల సురభి; మహిష్ఠుఁ డెవఁడు;
అతని వేంకటరామిరెడ్యగ్రగణ్యుఁ
దరమె వర్ణింప నలుమోము దొరకునైన. ౪౪
వదలి సురలోకమును వేల్పు మొదవు వచ్చె;
వెడలి నందన మరుదెంచెఁ బుడుకుమ్రాఁకు;
తలఁపుమానిక మతని సౌధంబుఁ జొచ్చెఁ;
గోశమును వీఁడి యా జేనిఁ గొలువొనర్చె. ౪౫
వలువల్ దాల్చుచు దక్షిణల్ వడయుచున్ భక్ష్యప్రపూర్ణాన్నమా
గళమాప్యాయిత నారగించి వికలాంగశ్రేణి నిత్యంబుఁ దే
పులనుం దేర్చుచు నాశిషంబుల నిడుం బుంఖానుపుంఖంబుగాఁ
గలుగన్ వేంకటరామిరెడ్డికిల సత్కల్యాణ పారంపరుల్. ౪౬
తనకున్ మూటపదారు లిచ్చి తగ సత్కారంబుఁ గావించె నం
చును, దుస్సేలువ లిచ్చి తన్నని పెనంచున్, నాదు కావ్యంబుఁ గై
కొని స్వర్ణాభిషవం బొనర్చె ననుచున్ గొండంత హర్షించు చా
తని వేనోళ్ల స్తుతించుచుండుఁ గవి బృందం బన్యరాడ్గోష్ఠులన్.

చదువుల సరస్వతియు, బ
ల్లిదమగు గానములకుఁ గూడలి, యశోలతకుం
గుదు, రకోశ్రీధనుఁ డట్టిం
డుదయింపఁడు ప్రాయికముగ నుర్విని నెందున్. ౪౮

వయసునఁ జిన్నయయ్యును బ్రవర్తనఁ బెద్దలలోనఁ బెద్దయై
స్మయమొదవించుచున్ దశ దిశా రమణీ స్తనచందనాయితం
బయి వెలుగంగ సద్యశ, ముదాహరణం బయి రాజవంశకీర్తికిన్
అయపరుఁడై పొసర్చెఁ గడు ప్లోదను వేంకటరామిరెడ్డియున్.
శ్రీకృష్ణ దేవరాయ
క్ష్మాకాంతుని, భోజరాజుఁ, గరగించి యిటుల్
శ్రీకర వేంకటరామ
క్ష్మాకాంతునిఁ జేసినాఁడు బ్రహ్మ తలంపన్. ౫౦

కవికోకిలములచేఁ గావ్యగానంబులు
సాఁగింపఁజేయు వసంతుఁ డితఁడు;
బీదసాదులఁ గృపన్ వీక్షించి దానంపు
వెన్నెలల్ కాయు జాబిల్లి యితఁడు;
తన చూపు తూపుల ననబోండ్ల యుల్లంబు
విభ్రమం బలరించు పువ్విల్తుఁ డితఁడు;
సకల విద్యలయందుఁ జాతురిం జూపు న
ద్దండుండు చతురాననుం డితండు;
పార్లపల్లెకు మాత్రితాఁ బ్రభుఁడుగాని
సర్వభూపాల నార్హతాశాలి యతఁడు;
రెడ్డిరాజుల మేల్బంతి; దొడ్డప్రభువు
రమ్యగుణశాలి వేంకటరామిరెడ్డి. ౫౧

మహి వెలుఁగు ద్వికరుఁ డాతఁడు
సహస్ర కరుఁడగును దానసమయములందున్
బహుధా ద్వినేత్రుఁ డయ్యును
సహస్ర నేత్రుఁడగు నర్థిసంతతిఁ గాంచన్. ౫౨

జనరత్న మతనిఁ బార్వతి
వనితా రత్నంబు చెట్టవట్టెను రత్నం
బును గూడును రత్నంబను
జనవాక్యము రిత్తవోక సార్థతఁ గాంచెన్. ౫౩

సత మాతారకమంత్రి రాజపఠనాసంగంబునన్ సమ్మదాం
చితుఁడై రాముఁ డనుగ్రహించిన వరస్వీకారముంబొంది పా
ర్వతి శ్రీ వేంకట రామిరెడ్డి విభు శ్రీరామావతారంబునుం
బతిగాఁగాంచి భజించుచుండె నరజన్మంబంది యీ తీరునన్.

కనక మేఖలమై రత్నకంకణమయి
పుష్పమాలికమై శిరోభూషణమయి
చారుతరమైన ముకురమై సౌరుమీరుఁ
బార్వతీదేవి తనదైన పాణిపతికి. ౫౫

కలిగి రా దంపతులకు నఖండమైన
పున్నెములఁజేసి 'వేంకమ' యన్న తనయ
శ్రీలుఁడగు 'పురుషోత్తమరెడ్డి' యన్న
పుత్త్రరత్నంబు రత్నంపు మొలకలట్లు. ౫౬

నిచ్చల్ తామరతంపరై వెలయఁగానీయిల్లు, దైవంబు నీ
కిచ్చం బట్టినదెల్ల బంగరముగా నేకోత్తర శ్రీలిడన్,
మెచ్చన్ లోకము నీ యదృష్టమునకున్ వేయేండ్లు ముత్తైదువై
పచ్చంగా మనుమమ్మ పున్నియపుఁగుప్పా! బిడ్డ! వేంకాంబికా!

వరవడి వ్రాయుమా! వరుస నీతాతతం
    డ్రులయు నవ్వారి పూర్వులయు కీర్తిఁ
బఠియింపుమా! దేశభక్తులై తగుగాంధి
    తిలకాది పూజ్యుల దివ్యకథలు
అనుకరింపంగఁ బ్రయత్నింపుమా! పూరు
    భరతేశ ముఖ్యుల ప్రాభవంబు
త్రవ్వింపు మాంధ్ర సరస్వతీ దేవి ప్రా
    సాద నిర్మితికిఁ బునాదు లిపుడె.
కవి జనంబుల కల్ప వృక్షంబటంచు
నర్థి బృందంబునకు వేల్పు టావటంచుఁ
బేర్ప్రతిష్ఠలు గడియించి వెలయుమయ్య!
ప్రియగుణా! పురుషోత్తమ రెడ్డివర్య! ౫౮

ముంగిటి ముత్తియంబయి ప్రమోదమొసంగఁ గశంకరుండు, ముం
గొంగుఁ బసిండివై తనదుకోర్కులుదీర్చుచు వేంకటేశుఁ డుం
డంగఁ గొమాళ్లఁ గూఁతులు, దిటంబుగ మన్మలు, మన్మరాండ్రు సె
ల్లంగ సతంబు నుండుము సుఖంబుగ వేంకటరామ భూవరా!



# వాసవదత్త

౧

శ్రీమద్గుణ పరితానా!
క్ష్మామండల మండనాయమానా! త్రిజగ
త్క్షేమవిధానా! వేంకట
శ్రీరామారెడ్డీన! ఖరపరతమ స్తపనా! ౧

అవధరింపుము ప్రద్యోతుఁ డాత్మజాత
కొఱకు హరియించి వత్సభూవరునిఁ దేరఁ
దన్మహీంద్రుఁ డిందు వాసవదత్త నాఁచి
దాఁబలాయనమైన కథాక్రమంబు. ౨

ఇలఁగల నానా దేశం
బుఁ దగు మణిపూస చందమున "వత్సము;" త
త్తిలకాయమానమయి భా
సిలుఁ గౌశాంబీపురంబు శ్రీనిలయంబై. ౩

ఉదయనుఁ డన్మహీశుఁడు మహోదయుఁ డాపుర మేలు; విద్దెలం
జదురుఁడు; సద్గుణాకరుఁడు; సర్వకళాపరిపూర్ణుఁ; డందునుం
గుదు రతఁ డాట గానకళకుం దనవీణియ మీఁటి వేటలన్
మదగజపంక్తిఁ బట్టు; నసమానుఁడు తజ్జనపాలుఁ డీక్రియన్. ౪

పలుకుల వెలంది వీణకుఁ గలిగినట్టి
ముద్దుబిడ్డయు, నారదమునివరేణ్యు
మహతి సవతాలు, ననుచు ధీమంతులండ్రు
ఘోషవతి పేరియాతని కొమరువీణె. ౫

పరికించి పెద్దతనమును
బరమంత్రులకన్నవిద్దె, బ్రాయమునను, ద
ద్ధరణీనాథుఁడు యౌగం
ధరాయణు నొనర్చె స్వప్రధానామాత్యున్. ౬

పరు లావులింపఁబ్రేవులు
పరిగణియింపంగఁ జాలువాఁడు, రణకళా
ధరుఁడేలు ఘనుఁడు యౌగం
ధరాయణుఁడు వత్సరాజునకు సచివుండై. ౭

పెట్టనికోటై పుడమికిఁ,
గట్టని కవచంబునయ్యె గాత్రమునకు, వే
చెట్టయి, తేనికిఁగుడిబుజ
మట్టులునై, రాజ్యతంత్రమాతఁడునడపున్. ౮

చాణక్యుఁడు గీణక్యుఁడు
రాణింతురె వానియెదుటఁ? బ్రజ్ఞానిధి గీ
ర్వాణాచార్యుఁడుఁ దత్పద
రేణువునకుఁ జాలఁడన ధరిత్రినిఁ కేలా? ౯

చిలుమెక్కెంగడుఁగత్తిమొత్తము; భటస్త్రీబృందమాత్మీయ నా
థులయాయల్లకతాపముం గొనక కంతుక్రీడలం దేలె ని
చ్చలు; వత్సేశుఁడుగుండెచేయిడి సుఖస్వాపంబునన్ మున్గె; నా
దలలన్ వ్రాల్పఁగ మంత్రిబుద్ధిబలిమిం దచ్ఛాత్రవానీకముల్. ౧౦

ఒడలిఁగోసియైన నొడయని సేవింపఁ
జాలునట్టి పెద్ద స్వామిభక్తి,
బుద్ధి కౌశలంబు, శుద్ధ స్వభావంబు,
వానికన్న ముందె ప్రభవ మొందె. ౧౧

పరిణాత గుణుఁడు యౌగం
ధరాయణు భుజాగ్రతలమునను నిల్పి ధరా
భరమును వత్సేశుఁడు దగ
నిరతం బేకాంతసౌఖ్య నిర్మగ్నుండై. ౧౨

ఒకసారి పీయూష మొలికింపంగఁ జేయు
గానంబుఁ గావించు వీణెముట్టి
ఒకతేపఁ గనువిందులకు విందు లొదవించుఁ
చిత్తర్వులకుఁ బోసి జీవకళలు
ఒకవేళ నొజ్జల కొజ్జయై వర్తిల్లు
ద్యూత ప్రసంగ వైదుష్య మందు
ఒకమారు మదపుటేనికల గొట్టెల నట్లు
వెంటఁ ద్రిప్పుచు నుండు వేట లందు
ఒక్కపరి నృత్యకళయందు, నొక్కతడవ
సరససల్లాపములయందుఁ జదురు సూపు;
మోపి యౌగంధరాయణు మూపురమున
రాజ్యభారంబు నావత్సరాజవరుఁడు. ౧౩

అల వత్సదేశము పయిం
దొలుతనె కనువేసియున్న దుష్టుల కారా
ట్రిలకుని సచివాయత్తత
సలుపుచు సంతోషమెదకు సందగపఱచెఁ. ౧౪

పరరాజుల పాచిక వ
త్సరాజుపైఁ బాఱదయ్యెఁ; దత్ప్రతికారా
చరణపరాయణయౌగం
ధరాయణుఁడు జాగరూకతను వరిల్లెఁ. ౧౫

భ్రమరము పూలనుండి మకరంద రసంబును సంగ్రహించు చం
దమునఁ గరంబుఁ గైకొనుచుఁ దత్సచివుండు ప్రజాళినుండి, స్వ
ర్ణము గురిపించుచుం బుడమి నాల్గు సెఱంగులయందు, సర్వ సౌ
ఖ్యములకుఁ గల్పవృక్షమయి క్రాలుచునుండెను వత్సమండలిన్.

విని యుంటిమి ముక్కంటిని;
వినితిమి వేకంటఁ గూర్చి; వినమైతిమి ధా
త్రినిఁ బది వేకన్నుల వా
నినిఁ గుఱించి యటంచు నాతనిం బ్రజవొగడున్. ౧౭

## ౨

శ్రీహరి పదాంబురుహచంచరీక! అమర
యువతిజేగీయ్యమాన మహోచ్చకీర్తి!
రమ్యగుణధామ! వేంకట రామిరెడ్డి!
అవధరింపు మనంతరం బైన కథను. ౧౮

ఆతని యొద్దికి నొకనాఁ
డేతెంచి యొకండు దూత యిట్లు తెలిపెఁ బ్ర
ద్యోతుఁడు కల్పించిన మా
యాతంత్రం బాదినుండి యంతము దాఁకన్. ౧౯

స్వామీ! దేవరవారి యానతిని సంచారంబుఁ గావించుచున్
భూమీమండల మెల్ల నుజ్జయినిఁ గన్గొనేఁగి కొన్నాళ్లటన్
నేమున్నారము వైశ్య వేషమున వాణిజ్యంబుఁ గావించుచున్
ఆమూలాగ్రముగా వచింతు మటమాయాలించునయ్యైకతల్.

చండ ప్రచండ వృత్తియుఁ
జండమహాసేన బిరుదశాలియుఁ బ్రద్యో
తుండను మహీమహేంద్రుఁడు
గండరగండం..ు దన్నగరిఁ బాలించున్. ౨౧.

శాలంకాయన ముఖ్యమంత్రులు నవిసంభంబు సేవింప, ద
ర్పాలంకారులు సింహవిక్రములు యోధాగ్రేసరుల్ కొల్వఁగా
మాళిస్థాపిత మాల్యముంబలెఁ బరుల్ మన్నింపఁ దచ్ఛాసనం
బేలుం బెంపు వహించి యుజ్జయిని భూమీశుండు దుర్దాంతుఁడై.

పరులకు నాతఁడు హృదయ
జ్వరమయి తమ ప్రక్కలోని బల్లెంబయి ని
ద్దురసింహస్వప్నంబయి
మరణంబును బ్రదుకు గాని మాదిరిని నుంచెన్. ౨౩

తలతో నొనర్తు రభూమీ
శులు నాతఁడు కాలితోడఁ జూపిన దానిన్
బలు కత లిఁకేల? వానిఁ
దలంత్రు ప్రత్యక్షుఁడైన దండధరునిఁగాన్. ౨౪

తన కనుసన్నల మెలఁగని
తనుఁ జీటికిఁ గొనని సత్ప్రతాపతపనుఁ డా
మన యేలిన వారిపయిన్
మనంబు వక్రించియుండె వత్సకాంతునికిన్. ౨౫

మొలకెత్తి తేని డెందపుఁ
బొలమున దివసక్రమమునఁ బొందుచు నెదుగన్
బలపడియు వేళు దన్నియు
బలుమారినయి మచ్చరంబు పంగలు వేసెన్. ౨౬

ఎదిరించి యేపుఁ జూపఁగఁ
బదనది లేకుని కతండు పండ్లు గొఱుకుచుఁ దా
గుదులుఁ గడుఁ; బేదకోపము
పెదవులకుం జేటటన్న విధ మిదియె కదా! ౨౭

ఇలఁ గుంపటిలోఁ దామర
మొలచిన చందమున నందమున కద్దంబై
లలి వాసవదత్తాఖ్యను
గలిగెం దత్పతికిఁ గన్యక యొకర్తు దగన్. ౨౮

ఆ యూ యీడునకుం దగు
నా యూ ముద్దు మురిపెంబు లగపఱచుచుఁ, గం
దోయికి విందొనఁగుచు నెల
ప్రాయంబొరాచకన్నె వడసెఁ గ్రమముగన్. ౨౯

ఆయమ కన్నుఁగల్వలకు హ్లాదము గూర్చు శశాంకుఁ డెవ్వఁడో?
ఆయమ మోముదమ్మికి మహోద్యుతిఁగూరుచు భానుఁ డెవ్వఁడో?
ఆయమ మేనిలోఁ దొఁబ్రియ మాఱఁజిగుర్పు వసంతుఁ డెవ్వఁడో?
ఆయమ వేనిభాగ్యముల యాకరమో? యనుకొందు రితజ్జనుల్ తగన్

అహమహమిక రాకొమరులు
గ్రహింప నాకన్నె కేలు, ప్రార్థించిన న
మ్మహినాథుం డీకుండెను
స్పృహణీయము లైన గుణము లెవ్వియు లేమిన్. ౩౧

తనబిడ్డన్ వరియింపఁగాఁ దలఁచి దూతం బంపమింజేసియుం
దనయాజ్ఞన్ శిరసావహించి తనుఁ బెద్దంజేయమిం జూచి, యే
లిన వారల్ వరణీయ రమ్యగుణపాళింబొల్చినందానె క
న్యను బ్రద్యోతుఁడొసంగఁడయ్యె; మదినన్యావజ్ఞ జేండ్లోర్తురే?

అనురూపుఁ, డనుపాత్రియుం;
డనుగుణుఁ డగు వరుని కొఱకు నన్వేషణముం
బొనరించెను ధరణీపతి;
కనంబడఁ డమాదృశుండు గలికంబునకున్. ౩౪

చదువు గలట్టిచోట 'నహి' చక్కదనం; బదియున్నచోట నా
చదువు హుళక్కి; యున్ననివి శాస్త్రముశూన్య; మివెల్లఁగల్గినన్
గుదురదు గోత్రభేద;మది గూడిన నొక్కడఁ జాలకుందునీ;
డది సరిపడ్డ నడ్డుపడు నన్య; మెటుల్ వరశుద్ధి యేర్పడున్?

తనయేకపుత్త్రికార్థం
బనుకూలుండైన వరునికయి కావించెన్
ఘనుఁడు భగీరథయత్నం
బును బ్రిద్యోతుండు నెల్ల మూలల యందున్. ౩౫

జ్యౌతిషికులఁ బ్రశ్నించెను
భూతల నాయకుఁడు; వత్స భూవరుఁడే నీ
కూఁతురిఁ బెండ్లాడు నటం
చాతనితో ననిరి యప్రియంబయి యున్నన్. ౩౬

వరణీయగుణంబులు గల
తరుణుఁడు మనచేనికన్నఁ దక్కన్యుం డి
ద్ధర లేఁడను సిద్ధాంతమె
స్థిరపడెఁ దుది కామహీంద్రు చిత్తమునందున్. ౩౭

వేనిపై మచ్చఱం బెద వేళ్లువాఱె;
వేనిపేర్విన్న నిలువెల్ల మేను మండు;
నతఁడు దేవుండె యగుఁగాక; యతని నెట్లు
తనకు జామాతగాఁ జేయఁదలఁచు జనుఁడు? ౩౮

తన్నుఁ దృణప్రాయునిఁగా
నెన్నఁడు నాతనికిఁ గన్నె నిచ్చు నతని ముం
దున్నది ముసుళ్లపండుగ;
బన్నంబులు వాని నిత్యపంటలుగావే? ౩౯

అయిన, మాత్సర్యమునువీడి యతఁడు వత్స
జనవరుఁడు వేఁడ మునుముం దొసంగఁ దలఁచె
నాఁడుఁబిడ్డలఁ గన్నవారైదుబిరుదు
లకట! తెగఁగోసికోవలె నండ్రుగాదె? ౪౦

క్రమముగ మాత్సర్య స్థా
నమునం బ్రద్యోతునికి ఘనంబుగ నభిమా
నమువుట్టె; సతము మనవ
త్సమహీంద్రుని దూతకొఱకు దారులుసూచున్. ౪౧

తానయి ముందుముందుగను దత్పతి వాసవదత్త నీయఁగాఁ
బూనఁడు; వత్సభూపతియుఁ బుచ్చఁడుదూతఁ బ్రతిగ్రహింపఁగా;
మానము దర్పముం గలుగు మానిసులాటను దీసిపోరు సుం
తైనను వార లిర్వురు; నిజాగ్రహముల్ ద్యజియింప రాత్మలన్.

ఎరఁజూపి చేపఁబట్టెడి
కరణిని, మిథ్యాగజంబుఁ గన్పఱచి మహీ
వరుని గజాఖేటపరుని
హరింప సచివోక్తిఁ దుదికి నాతఁడు దలఁచెన్. ౪౩

ఆలోకించుచు యుక్తకాలమును రంధ్రాన్వేష ణాయత్తుఁడై
శాలంకాయన మంత్రినాయకముఁ, బ్రాంచద్వీరగర్భంబు, ను
త్తాలానీలమునైన కృత్రిమకరిన్ స్థాపించె, నన్మద్ధరా
పాలుం డీదినమందు వేఁటకయిపోవంజూచి యక్కానలోన్.

మనయేలిన వారినిఁ ద
జ్జనపతిగొంపోయి యిట్టి చందంబునఁ ద
త్తనయా కటాక్ష జాలం
బున కగ్గ మొనర్చు నురులఁ బులుఁగుం బోలెన్. ౪౫

తన దర్పంబునకున్ రవంతయుఁ గొఱంతం జూప, కాఁడిటుల్
తన కన్యామణి పాదదాసునిఁగ వత్సక్ష్మాపతిం జేయు కో
ర్కి నానాయాసము దీర్చికొఁదలఁచె, నీ కృత్యంబు సిద్ధించినన్
వినుఁ డూరేఁగును దద్యశోరమణి దిగ్వీథీ ప్రతానంబునన్. ౪౬

రెండుపండు లొక్క వ్రేటునవలె నాతఁ
డొందు రెండు మేళు లొక్కదాన;
మనదు తొంటియశము మటుమాయమైపోవు;
నపయశంబు దెసల నలముకొనును. ౪౭

అని యావద్వృత్తాంతము
వినిపింప నమాత్యవరుఁడు విని విశ్రాంతిం
గొన దూతనంపి తేనిని
వెనుకకు రప్పింప నొక్కవేగును బిలిచెన్. ౪౮

పిలిచి ప్రభునికి యథార్థము
దెలిపిన మృగయాభిలాష విడి రాఁ డనుచుం
దలఁచి "యొక ముఖ్యకార్యము
గల" దని కబురంప నతఁడు గడఁగుచు నుండన్. ౪౯

శ్రీ మత్పారలపల్లీ
గ్రామణి! రమణీకదంబకందర్ప! గుణ
స్తోమా! వేంకటరామా!
సామోదత నవధరింపు మటు పైని కథన్. ౫౦

హరిణవ్రాతము రోజుకొంచుఁ బ్రబలాయాసంబునం దూలఁగాఁ
గరముఁ వెన్కకుఁజిక్కి, వాయుతతి శిక్షంగోరి వెంటాడఁగాఁ,
బరువెత్తించుచు వారువంబును నిజస్వాంతంబుకన్నన్ వడిన్
జరుఁడొక్కండరుదెంచివ్రాలెను నృపాస్థానంబుద్వారంబునన్.

తనువుం దొలంగి కవచమె
చనుదెంచినకరణి వదలి క్ష్మాకాంతుని ర
క్షణ మొంటిగ నేతెంచిన
జనుఁగని నిర్ఘాంతపడుచు సచివుఁడు నిలిచెన్. ౫౧

ఎగరొప్పుకొనుచు నశ్వము
దిగి యాతఁడు మంత్రియెదుట దీనాననుఁడై
వగపునను బ్రియాసమునను
డెగి నోటను మాటరామి దిటమఱి నిలిచెన్. ౫౩

అరనిముసమట్లు నిలఁబడి,
చరుం డొగింగ్రేటుకొనుచు, సచివోత్తమునిం
బరికించి పూసగ్రుచ్చిన
కరణిని వత్సేశువేఁటకత, నెఱిఁగించెన్. ౫౪

ఏలినవారు వీడి యిచ టెల్లలులేని మహాసముద్రముం
బోలిన పెద్దదండుగాని పోయి క్రమించి నదీ నదంబులం
గాలువ లట్లు, నర్మద సకాశమునంగల వేణుకాననం
బోలినిఁ జొచ్చి సైన్యముల నొక్కట నిల్పిరి చెట్లచాయలన్.
కతిపయ పరివార పరీ
వృతుఁ డాతఁడు నాగవనము పేరిట నన్వ
ర్థతఁ గాంచిన వేటడవికి
స్వతురంగముఁ దోలికొనుచుఁ బటచెం బిదపన్. ౫౬
ఆ యడవిం గుల్మములు వాఁ
డా యవనీ ధవుఁడు గాంచుఁ చటఁ గరిపదము
దారియుతమగు మార్గంబును
రోయుచుఁ జనుచుండ నొకసరోవర మందున్. ౫౭
పెటకుచుఁ దూండ్లు దమ్మి విరి పిండును నెల్లియలట్లు పట్టుచున్
గరముల నీరుపీల్చి గగనంబునకున్ విరఁజిమ్ముచున్ సరో
వరమును బాల సంద్రమును బర్వతరాశివలెం గలంచుచున్
గరినికురుంబ మాతనికిఁ గన్పడి పెంచెఁ గుతూహలం బెదన్.
ఈ గతినిఁ బెద్దకాలం
బాగజయూధంబు నీటియందాడి యెడ
ల్లాఁగించు కొనుచుఁ ద త్తట
భాగమునకు వచ్చుచుండెఁ బంకోద్ధితమై. ౫౮
తన ఘోషవతీ వల్లకి
జనపతి శ్రుతిసేయఁ గడఁగఁ జరుఁ డొక్కండా
యన పాదమూలమునకుం
జనుదెంచి వచించె నెరగి సాష్టాంగమునన్. ౬౦

దేవా! యియ్యెడ కొక్కక్రోసు దవులం దిగ్దంతులంబట్టి నూ
నూవుంజేయ సమర్థమౌ మదపుటే నుం గేకనీలంబు త
త్ప్రావృ డ్వారిద మట్టు, లీయడవిమధ్యం బాదపచ్ఛాయఁ ద
త్సానర్ణ్యంబున యత్నదృశ్యమయియాశ్చర్యావహంబై తగున్.

పుట్టి బుద్ధి యెఱుఁగు తొట్టి యెన్నింటినో
కాంచినాఁడ మత్తగజము లవని
నీదృశంబుఁగాన నేకనీలంబయి
కొండఁ బోని యేనుఁగున్న నొండు. ౬౨

అనుచు నివేదింపఁగ నా
తని నాత్మీయునిఁగ బ్రమసి ధరణీపతి వా
నిని సత్కరించి పెద్దయు
ధనసందోహంబుచే నతని కిట్లనియెన్. ౬౩

"కఱచితి గజశాస్త్రంబున
"ధరఁగాటుకకొండఁబోని స్తంబేరమ మొ
క్కరుఁ డుండు" ననుచు,దానిఁ
బరికింపఁగ నైతి నింత వఱ కెయ్యెడలన్." ౬౪

అని పరివారము వైపును
గని మీ రిట నుండుఁ డే నొకండన చని దా
నిని వీక్షైకసహాయుం
డనై వశంపఱచికొని హుటాహుటిఁ దెత్తున్. ౬౫

అనియేఁగం ద్వరమాణ చిత్తుఁ డయి స్వీయాశ్వం బధిష్ఠింపఁగా
మనసేనాపతి డాసి వ్రాలి పదపద్మద్వంద్వ మం దో ప్రభూ!
చన దేకాకివిగాఁ జరింప; నది యాశంక్యప్రదేశం; బటన్
అనయంబుంజరియింత్రు శాత్రవులు రంధ్రాన్వేషణాసక్తులై ౬౬

మొదలంబోవల దా ప్రదేశమునకుం; బోఁగాఁదలంపేని నీ
యెదవాలాయము; పెద్దదండుగొని స్వామీ! పోవన్వర్షంబు నీ
కది కాకుండిన వెంబడిం గొలఁదిసైన్యంబేనిఁ గొంపొమ్మ; య
య్యదియున్ నీకురుచింపకున్నఁ గొనిపొమ్మా యొక్క
నన్నేనియున్. ౧౭

నడగోటకరణి నీవెం
బడి వచ్చెద నేను నీకు వజ్రాయుధమై
కడిమిమెయి విఱుతు నీపైఁ
బడు శాత్రవశైలపంక్తి పక్షము లెల్లన్. ౧౮

ఆకార్తవీర్యుఁ డట్టులు
వేకరముల విక్రమించు వీరుఁడవు పరా
నీకముపయి,కీ వైనను
నాకష్టముఁ దీర్ప మన వొనర్చితి నిట్లుల్. ౧౯

వ్యతిరేకంబుగ మీ యా
నతి కిట్లాడితి నటంచు నాపయిఁ గినుకన్
క్షితినాథ! కొనకుమీ! స
న్మతి "స్నేహః పాపశంకి" నాఁగను వినవే? ౨౦

ఆ విధి మనవి యొనర్చిన
నావత్సేంద్రుం డనుగ్రహము నూపకయే
యావార్యంబును మించుం
దీవియచందమునఁ బరుగు దీయించు నెడన్ ౨౧

తనవెంటఁబాఱు దళవా
యిని మధ్యేమార్గమందు వీక్షించి కటా!
తనపై నొట్టిడుకొని పతి
వెనుకలనికిఁ ద్రిప్పివైచి వెడలెను నాలోన్. ౨౨

ప్రతికూల దైవునకు నే
హితోపదేశములు చెవికి నెక్కును? గాఢుల్
వెతలను వెతకుచుఁ బరుగిడ,
మతియుతులును వెనుక కెట్లు మరలఁ గల రిలన్? ౭౩
అసహాయ శూరుఁడగు మన
వసుధాపతి తొంటిచరుఁడు పలికిన తీవ్రన్
బసిపట్టి పఱచు సింగపు
పసతోఁ జనె నగ్గజంబు పసపట్టంగన్. ౭౪
ఈఁగను దోమనుం జొఱఁగ నీయని దట్టపుఁ జెట్లపిండునన్
సాఁగుచు స్వప్రతాప తపనద్యుతికాండపుఁ గాగడాలచే
మూఁగిన కాఱుచీఁకటుల మొత్తముఁ బ్రక్కల కొత్తిగించుచున్
ఏఁగెఁ గ్రమక్రమంబుగ మహీశ్వరుఁ డేనికయున్న కోనకున్.
గిరితతి కట్టని గోడల
కరణిం గన్పట్ట దారి గనరాని యటన్
నరపతి పద్మవ్యూహముఁ
జొరఁబడి చనుచున్న యట్టి సొరిదిం దోఁచెన్. ౭౫
ఒడ లెల్లం గనులన్ రచించుకొని యా యుర్వీశుఁ డీక్షింప న
క్కడఁ బెంజీఁకటి మ్రానిపిండునడుమన్ గార్కొన్న కాయంబు గ
న్పడియుం గన్పడ నట్టులుండ సరిగాఁగాంచంగ నయ్యేన్గు నా
ల్గడుగుల్ ముందుకుసాఁగిడిగ్గియుఁదురంగంబుం బ్రశాంతంబుగాన్.
పరకాయించి కనుంగొని
కరియేయని నిశ్చయించి కడు శ్రావ్యతఁ గి
న్నెరమీటఁ దొడఁగె నాగ
స్వరంబు సహితుండికుండు వాయించు గతిన్. ౭౬

గిరిగర్భము నుండి వలెం
గరి గర్భమునుండి ఘోటుకాండ్రురు పఱితెం
చి రసంఖ్యాకు లపుడు చూ
పఱికుం గనువ్రేఁగుగొలుపు బలదర్పములన్. ౭౯

కండలు దేఱినట్టి భుజకాండము ముందుకు దూఁకఁగా, నయః
పిండములన్ హసింపఁగల బెట్టిదమైన యొడళ్ళు త్రుళ్లఁగా,
దండితనంబు వాఁడిమియు దర్పము మేరలు మీఱ, నప్పు డా
గండరగండ లొక్కత్రుటి క్ష్మాపతి డాసిరి సింహగర్జలన్. ౮౦

తలవని తలఁపుగ మనపతి
వలనికి వీతెంచుచున్న వాఁడిమగల ద
వ్యూలఁ గన మదిఁ దోఁచెను నా
కలకథ యడ్డంబు దిరిగె నని యవ్వేళన్. ౮౧

కన్నుల్ మూసి గజేంద్ర మంత్రజపముం గావించు చందంబునన్
మన్నీఁ డేమఱియుంటఁ దన్ను నిజవీణాగానముం జేసి, పెన్
సన్నాహంబున మీఁదికిం బఱచు నా సైన్యంబు వీక్షింపఁ డా
సన్నం;బూడవె బేరసారము లిలన్ సంగీతపున్ మత్తుచేన్? ౮౨

ఒకపరి కన్నులు దెఱవఁగ
నెకిమీనికి నొక్కబారెఁ డెడమున నకటా
లుకలుక లాడుచు వీర
ప్రకాండు లగపడిరి. నిప్పు రాలెడు కనులన్. ౮౩

కనుమూసి తెఱచు లోపల
జనపతి వారువముపైకిఁ జంగున నెగిరెన్
గనియును వినియు నెఱుంగము
మనమా మెఱుఁగులకు నట్టి మాదిరి జవమున్. ౮౪

ఒఱినుండి పెఱికి చుఱియను
గరకరిచూపులకుఁ దోడు గడు వాఁడితనం
బుఱుకంగ నొడలి నుండియుఁ
జఱచఱ పరసేన పైకి "జై" యనఁ బఱచెఁ. ౮౬
తురగంబుఁ బరసైన్యరాశిపయికిం దూఁకించుచున్ వీఁకమై,
ఖురఘాతంబుల మట్టగించుచును,నుగ్గున్నుగ్గుఁగావించుచున్,
శిరముల్ డుల్చుచు జొన్నకంకులవలెన్, సింగంబులం జించునా
శరభంబట్టులు విక్రమించె మనవత్సక్ష్మావరుం డత్తఱిన్. ౮౭
తొలి వజ్రాయుధముం ధరించి పురుహూతుం డద్రులంబట్టి ఱె
క్కలు ఛేదించిన ఘట్టముల్, గిరులసంఘంబుల్ ఘరట్టాభమై
జలధిన్ దుర్మిన మందరాద్రికథలున్, సాక్షాత్తుగాఁ జూపె ను
జ్జ్వల తేజోనిధి పెక్కురంగముల నా సంగ్రామ మధ్యంబునన్.
సురలను దక్షాధ్వరమునఁ
దఱిమిన యా వీరభద్రు ధాటియుఁ గ్రూరా
సురఘాతి క్రౌంచదారణు
పరాక్రమము నతని యందుఁబగఱకుఁ దోఁచెన్ ౮౮
ఒకపోటొక్క శతఘ్నిగ,
నొక వ్రేటొక పిడుగుగాఁగ, నూర్జస్వలుఁడై
కికురించి యని నొనర్పఁగ
వకవకలు యథాయథలును బగతైరి బళీ! ౮౯
సుడిగాలి క్రేప వార్వము
కడిఁది తనతోఁక విసరి, కారాకులయ
వ్వడువున నుక్కిరి బిక్కిరి
పడుచుం డాడాల కెగిరి పడిరి పగ ఱనిన్. ౯౦

తెమలిచికొని తోడేల్పయి
గుమిగొని దండెత్తిపోవు గొఱియలవలె ధై
ర్యముఁ దెచ్చుకొనుచు నరిసై
న్యము ముందుకు సాఁగు; వెనుక కడుగిడుచుండఁగన్. ౯౨

సందీ కట్టులు తద్దయుం బెరుగు తచ్చాండీర్య మార్పంగ న
మ్మం దేవారినిఁ గార్మొగుళ్లవలెఁ గ్రమ్మంజొచ్చె సైన్యంబు తే
నిండట్టంబుగ నల్వాలంకులను; మన్నీఁ డాత్మఁ గైకోక త
త్సందోహంబును బూరికిం; బరులు మెచ్చం జీల్చి చెండాడుచున్.

కలగుండు పఱుచుచుండెను;
బలఁగంబులు విచ్చిపాఱి వచ్చుచునుండెన్
దళవాయి యానధాటికి;
పలుతడవ లిదే విధంబు వర్తిల్లె నటన్. ౯౩

పరులకు గుండె లదల్చెడు
పరాక్రమము బాహుబలముఁ బ్రభువుల కిట్టీ
వఱకున్నదనుచు నెఱుఁగను
బరరాజులు కత్తిదింప భవదాజ్ఞమెయిన్. ౯౪

మనదొర కప్పటికొడ లె
ల్లనునలఁగెం; జూసినట్లు లావంతయుఁ దీ
సెను; దప్పిగూరె; హస్తం
బున ఖడ్గము జారెఁ; గీర్తి బాలకుఁ బాఱెన్. ౯౫

బలవత్తరమగు దైవము
బలఁబు తఱుగుటను జేసి, బలమఱి మనరా
ట్తిలకుఁడుఁ జిక్కెను బరులకు;
దలబోయులు కెత్తువడ్డ హార్యక్షమునన్ ౯౬

ఏకిమీానిదెబ్బకా మె
త్తికోలునకుఁ గంప మెత్తి దెసలకుఁ దమకా
లికి బుద్ధిసెప్ప వీర
ప్రకాండు లాయయ్య లిపుడు వట్టిరి వారిన్. ౯౬
మన దేవరవారిని విడి
ననుఁబట్టిన మేలటంచు నాచిత్తమునం
జనియించెఁ గోర్కి; తాదృశ
ఘనపుణ్య మొనర్ప నైతిఁగద తొల్లింటన్. ౯౭
ననుఁ మర్దించెనుఁ హీనహీనముఁగ; మానాన్నన్ వధించెంగటా!
తునిమెన్ ఱెక్కలు మాసహోదరునికిం; దూఁటాడె మా మేనబా
వను; గావించెను రెండు తుండెములుగాఁ బాదంబులన్ మాదు మి
త్రునికీతం; డని నద్దెసల్ బలిసి శత్రుల్ ముట్టె వత్సేశునిన్. ౯౯
భరతము పట్టించెద మని
యొఱగొడ్డెంబులను జేరిలు చొడలిని గత్తుల్
గురిపింప నెత్తియుండిన
తరుణంబున వచ్చి వారిదళవాయి యనెన్. ౧౧౦
"వలదు సాహస మొనరింపవలదు వలదు
ప్రల్లదంబులు పలుకంగ వలదు వలదు
ఒక్కనికిఁ జాలకయుఁ జూపి పిక్కబలము
శిరసు వంపక యివ్విధి మొఱఁగఁ దగునె?"
అని చీఁదరింపఁ దద్భట
జనంబు కత్తులను డించి స్వాంతము మోదుపుం
గొనఁ గొలఁది దాలకుం జని
మొఁనగానికి దారి నిడిరి భూవరు కడకున్. ౧౦౨

ఆతం డెవ్వఁడో యాభిజాత్యమునఁ బెద్దైయుండుఁ గాకున్న నా
రీతిన్ శాత్రవుఁడైన వత్సపతికీర్తిన్ మెచ్చుచున్ దుష్క్రియా
చేతస్కుంబగు నాత్మసైన్యము నిటుల్ చీవాట్లనుం బెట్టునే?
ఏతాదృఙ్మహితార్జవంబు గలవారేకొందఱో యుంద్రిలన్.

ఏలినవారి యదృష్టము
మేలైనది; దానికన్న మేలైనది పె
క్కేల మన యదృష్టమః; తగు
వేళకు దళవాయి వచ్చి వేయుట నటకున్. ౧౦౪

అన్నట్లు చెప్ప మఱచితి;
మున్నా గజవార్తఁ దెలిసిపోయిన చరుఁడుం
గొన్నిప్పులఁ బైఁ జెఱఁగెడు
కన్నులతో వారి నడుమఁ గానఁగ వచ్చెన్. ౧౦౫

ఆ మహితుం డంతట మన
స్వామికి వందన మొనర్చి సాంత్వనములతో
సీమములులేని గౌరవ
భూమిక నెక్కించె; నాకు ముదమయ్యె మదిన్. ౧౦౬

“కొనిపొండుజ్జైనికి నీ
తని నందల మెక్కఁజేసి త్వరగా” నని య
మ్మొనగాఁడు వచించిన దా
నను దత్ప్రద్యోతువంచనంబని తెలిసెన్. ౧౦౭

మన ప్రభువుల నప్పగతురు
గొనిపోవుచునుండ ‘నడ్డుగొందును; నేఁ జ
చ్చినఁ జత్తు’నని తలంచియు
వెనుకాడితి వచ్చి తెలుప వృత్తం బెల్లన్. ౧౦౮

ఈ పాపపుకన్నులతో
శౌర్యపతిఁ గొంపోవుచుండ శత్రులు గంటిఁన్
ఆ పార్థివు నుప్పుం దిని
నీపగిదిని బలిసియున్న యీయెడ లేలా! ౧౦౯

మనప్రభుపునుగొని వారటు
సనఁ జేతులుపిసిగికొనుచు సత్వరగతినై
మనసేనలు గలచోటికిఁ
జనుదెంచితిఁ బంపఁదలఁచి జనపతిఁ గొనితేఁ. ౧౧౦

కాని రుమణ్వంతుఁడు మన
సేనాపతి "యిట్టిచేఁత చేతులు కాలం
గా నాకులుపట్టుట" యని
తా నిశ్చయపఱచె; నట్టి తఱి దాఁటుటచేఁ. ౧౧౧

మన మెల్లర మింతకు మన
జనవరుఁడు సజీవుఁ డంచు సంతోషింపం
జను; మొదలలోఁతగు దుఃఖం
బునర్మ మోఁకాలిలోఁతు మోద మనుగతిఁ. ౧౧౨

మనసైన్యమునకుఁ దల దీ
సిన చందంబయ్యె; మనదు సేనాపతి మో
మును మీకుఁజూప వెఱచుచుఁ
జనుదెంచుచునుండె వెనుక సంకోచముతోఁ. ౧౧౩

శ్రీ పార్వతీ మనోహర!
స్థాపితకీర్తి ప్రతాప ధామోద్దామా!
భూపతి! వేంకటరామా!
ఆ పైకథ నవధరింపు మయ్యా! ప్రీతిన్. ౧౧౪

యౌగంధరాయణుం డా
వేగిగతిఁ దెలిపియున్న వృత్తము విని యు
ద్వేగము డెందము గలఁపగ
వ్రేగున వంగంగ సిరసు పెంపటి నిలిచెన్. ౧౧౫

నిలిచి దిక్కుల శూన్యదృక్కులను బఱచు;
వేఁడినిట్టూర్పులను బుచ్చు; వాడిమోము
పోఁడివీడంగఁ జింతల మునిఁగియుండుఁ
బరహృతస్వీయపతికయౌ భార్యవోలె. ౧౧౬

కలగుండు వడుచు నివ్విధిఁ
గొలంది తడవిట్లు తలఁచుకొనె మది, "వేక
న్నుల మెలఁగుచున్నఁ బగతుఁడు
బలిమిని మాపైని సొడ్డు వైచెను గట్టా! ౧౧౭

నీరింద్రావవు పక్షు లేనియును క్షోణిన్ వేని పేర్విన్నచోఁ;
నే రాజేంద్రుని పాదపద్మములు "త్రాహి త్రాహి"యంచాడుచున్
రారాజుల్ బొమిడీకముల్ వదలియర్చల్ సేతురో! యాఘనుం
డేరీతిం బగవాని మ్రోలఁ గయిదోయింగట్టి నిల్వంబడున్?

విశ్వ మేలునకులుఁ డశ్వశిక్షకుఁడైన
పగిది నయ్యె మాదు ప్రభువు బ్రదుకు
వ్యాధికుంఁగాని యౌషధం బున్నదే
విధికిఁ బృథివి నెల్ల వెదకిచూడ? ౧౧౯

నెఱికిం గట్టి గిరీంద్రముఁ
జగచర పెకలించి లాఁగుచందంబున దు
ష్కరమగు కార్యముఁ బగతుఁడు
విరచించెను సుకరముగను విధి నేమందున్? ౧౨౦

కనులం దెఱచియె నిద్దురఁ
గొనుచున్న నహర్దివంబు గూఢతరముగాఁ
జనుదెంచి పరుఁడు గేల్దో
యిని, గాజులు దొడిగిపోయె నివ్విధి నాకున్. ౧౨౧

నలుగురిలో మునుపటివలెఁ
దలయెత్తుక తిరుగు విధము దప్పెను నా కీ
యిలఁ జెత్త నాళ్ళు వచ్చెను;
దొలంగిచనె మెత్తనాళ్ళు దూరంబునకున్. ౧౨౨

కొండల బెండులఁ జేసియు
బెండులఁ గొండలనుజేసి విధి దుర్వశమై
తాండవ మాడునుగద! యు
ద్దండుం డింద్రుండుఁ బడఁడె దానియిరుసునన్? ౧౨౩

పరకృతమైన యీపరిభవంబున కన్నను నన్నుఁ గాల్చు డె
ప్పరముగ నవ్విపోఁగలరు వారలు వీర లటన్న భావ మి
త్తఱిని; మగండు బిట్టడఁచు దానికిఁ గాకయుఁ దోడికోడ లే
డ్తెఱ నగునంచు నేడ్చెడి సతిం దలఁపించుచునుండె మత్కథల్.

అనుకొన్చుండఁగ నిట్లు నెత్తురికణమొండై నంగనన్ రాని యా
తని మోముం దిలకించి చారుఁడనెనంతన్ "దేవరా! కొండ క్రుం
గిన చందంబున మీరె యిట్లయిన నీకీడుం దొలంగించి మే
లొనఁ గూర్పంగలలాఁతి మేటిమనకొండున్నె స్వరాష్ట్రంబుగన్?

క్షితిని నీతుల్యుఁ డగు కుశాగ్రీయ బుద్ధి
కాగడా ల్వేసి వెదకినం గానరాఁడు
మొక్కవోవు టెఱుంగని బుద్ధినీది
పదను సెడిపోనినీతి నీయది తలంప. ౧౨౬

వచ్చి వేతువు ముక్కునం జొచ్చి కంటఁ
గంటి పాపను దీసెడు దంటవీవు;
పొడుపుకత లట్లు నీ పన్నుగడల విప్ప
నాదిశేషుని కేనియు నలవిగాదు. ౧౨౭

బ్రహ్మవ్రాసిన వ్రా ల్చెఱుపంగఁ గలవు;
బ్రహ్మ వ్రాయని వ్రాలను వ్రాయఁగలవు;
తిమ్మి బ్రహ్మిని; బ్రహ్మినిఁ దిమ్మిఁ జేయు;
చదురుఁడవు నీవు; చింతింపఁ జన్నె? దేవ! ౧౨౮

బెడిసెను వ్యవహారం బి
ప్పుడు; మెల్లఁగ ముండ్లఁబడ్డ పుట్టంబును బి
ట్టూడుపునఁ దప్పించిన గతి
నొడయనిఁ దప్పించి మేలు లొనఁగూర్పఁ గదే? ౧౨౯

ఇతికర్తవ్యత నీకుం
బ్రతిబోధము సేయఁదగ్గ వాఁడనె స్వామీ!
చతురోపాయజ్ఞుండ; వు
చితజ్ఞుఁడవు; ప్రాజ్ఞుఁడవును జెప్పఁగనేలా?" ౧౩౦

అనుచుం బల్కుచునుండ నంతిపురి వత్సాధీశ్వరుల్ స్వీయ పుత్రునిఁగొంపోయెను గూటయోగమునఁబ్రద్యోతుండటంచుగ్రవార్తనయో! పాపముమూఁడుకాళ్ళముదియారాణ్మాతయాలించి వెంటనె నిర్ఘాతముచేత మొత్తఁబడుచందంబొంది మూర్ఛంగొనెన్.

భుగభుగమని పూరింటికి
నెగఁబ్రాఁకెడు నగ్గివోలె నీవృత్తం బా
నగరంబున కెగఁబ్రాఁకెను
బొగిలెఁ; న్నొగిలెం బ్రజాసమూహంబు గడున్. ౧౩౨

తమనెచ్చెలి తమ చుట్టముఁ
దమ ధర్మప్రభువుఁ దమదు దైవము నని వ
త్సమహీంద్రునిపై యాప
ట్న మెల్ల నట్టుడికి నట్లుడికెడందన్నడికెన్. ౧౩౩

ఏవలన నాలకించిన
నే వారల నోటవిన్న నేలికపయిఁ బల్
దీవనలును బగతునిపై
వేవేల్ శాపములు దక్కఁ బెఱలేవు నుడుల్. ౧౩౪

తొలికాలంబున నిల్వలాసురుఁ డగస్త్యున్ మ్రింగి జీర్ణించుకోఁగలవాఁడయ్యెనె? సైంహికేయుఁడునురాకాచంద్రునిన్ మ్రింగి వెల్వలకుం గ్రక్కఁడె? గుజ్జుముందినిన యా శ్వానంబు చందాన నీపలుగా కెట్లఱిగించుకోఁగలఁడు? మావత్సేశు నం డ్రెల్లరున్.

తమ రాజేంద్రుఁడు స్వస్థగాత్రుఁడయి భద్రంబొంది ప్రద్యోతుబంధముఁ దప్పించుకవచ్చి దర్శనమిడం దత్పౌరు లాశించి దైవముఁబ్రార్థిం; త్రభిషేకముల్ సలిపి గొబ్బండ్లప్పనల్ సేత్రుపానముఁగావింతురుకట్టుచుంద్రుముడుపుల్; సాగింతు రారాధనల్

నగరస్థితి యిట్లుండఁగ
జగతీపతిజనని పంపె సందేశంబుం
దగ మూర్ఛ దేఱి సచివుం
డగు నా యౌగంధరాయణార్యుని కిట్టుల్. ౧౩౭

"నా పుత్త్రుఁడు నీ మిత్త్రుఁడు
పాపాత్ములచేతఁ బట్టు వడెనని వినియున్
ఈ పగిది మొండి కట్టెగ
నై ప్రాణము పోకయుంటి నన్నా! వింటే! ౧౩౮

అనఘా! నా కీ ముదుసలి
తనమునఁ బైఁబడియె బెట్టిదం బిది ముద ము
ప్పున నంగిటి ముల్లన నా
ర్చినఁ దీర్చినఁ నీవె! విశ్వసించితి నిన్నే! ౧౩౯

గాలినిఁ దాఁడుపేనగల గండరగండఁడ; వీఁదినేలఁ బా
తాళముఁ జొచ్చి పోవఁగల దంటవు; పట్ట పగంటఁ దారకా
జాలము మొల్వఁ జేయుదువు; శైలములన్ భువిఁ గ్రుంగఁ జేయఁగాఁ
జాలుదు;మిఁగరానికడి ఘొమ్మ తలమందొకఁడున్నె నీకిఁకన్!

తిరుగదునీ ప్రజ్ఞాస్త్రము
దిరుగును బ్రహ్మాస్త్రమేఁ; ద్వదీయ రహస్యం
బెఱుఁగుదు వీవా కరుండవె!
మెఱుంగుఁ దనకాళ్లు, తానయి భుజంగ మిలన్ ౧౪౧

ఎదు రీఁదిపోవఁ గల వా
పదంబుధి కరుల్లయందుఁ, బద మెన్నండుం
గుదియింపవు వెనుకకు; నీ
యది భల్లూకంపు పట్టు టందురుగాదే! ౧౪౨

తెలుపఁగ వలయునె సర్వముఁ
దెలసిననీ కొకటి? నీవె దేవుండవు మా
కొలమునకుఁ; బుత్త్రిభిక్షకు
"నిలిచితి నాకొంగు సాఁచి నీ దగు మ్రోలన్. ౧౪౩
అనెడు సందేశ మాద్యంత మాలకించి
పుత్త్రి భిక్షను బెట్టుమన్ ముసలి యవ్వ
మాటలకు నొక్క పెట్టున మంత్రివరుఁడు
మునిఁగి పోయెను గన్నీటి ముంపునందు. ౧౪౪
కొలఁది కాలంబునకుఁ దెప్పిఱిలి యతండు
రాణికిం జెప్పి పంపె" నా ప్రాణములను
మా ప్రభుప్రాణముల కొడ్డి మరలఁ దెత్తు
గుండెపైఁ జేయినిడి నిద్రఁబొందు మీరు. ౧౪౫
నెలలోపల శత్రుల నొక
కొలికికిఁ దెప్పించి నీదుకొమరునిఁ దెత్తున్
నిలుపకయుండిన నీ క
న్నులకడ యౌగంధరాయణుఁడఁగానుజుఁడీ! ౧౪౬
పరమంత్రులవిడి నాకే
కిరీటముం బెట్టి పెద్దకీర్తించిన నా
దొరరుణము దీర్చికోఁదగు
తరుణం బాసన్న మగుట ధన్యుఁడ నైతిన్. ౧౪౭
అని ప్రతినవట్టి యాశ్వా
సనముల నోదార్చి తల్లి, సాధన చింతన్
మునుఁగుచుఁ దేలుచు నుండఁగ
జనుం డొకం డేగు దెంచి సచివుని కనియెన్. ౧౪౮

అల విప్రోత్తము లీదినంబు మనరా జారిష్టశాంత్యర్థ మ
ర్చలుఁబారాయణముల్ రచించిగుడిలోఁబ్రాశింపఁగూర్చుండఁగా
మొలకున్ గోచులు నొదలం గవులు కంపుంబేలికల్ చింకిపాఁ
తలుమైఁజుట్టివెడంగువాఁడొకఁడుతత్రాప్రాంతస్థుఁడైచూచుచున్.

నవ్వుచుఁ దనచేతలచే
నవ్వించుచుఁ బరుగు లిడుచు నలువలఁకులకున్
రివ్వనఁ గట్టెను నేలం
ద్రవ్వుచు నెగి రెగిరిపడు చతఁడు గొంతాడెన్. ౧౫౦

ఆడుచుఁ బాడుచు నతఁడా
బాడబులను గూర్చి యిట్లు వలికెను "మీరల్
గూడుం గడుపాఱఁ దినుం;
డోడక యభ్యుదయ మొందు నొడయం డనుచున్. ౧౫౧

అతఁ డదృశ్యుఁ డయ్యె నక్కాలమున యందె
విడిచి తనదు వెడఁగు వేస మచట;
నతఁ డెవండొ? యేటి కరుదెంచెనో? యదృ
శ్యత్వ మేల కనెనో? చాల మెఱుఁగ. ౧౫౨

అది యిది చదువుచు నడుమ
'న్నిది వ్యాసప్రోక్త'' మీర లెఱుఁగుం డనుచుం
బదిఁబదిగఁ బలికె నాతఁడు
మొదటనె యిద్దాని మఱచిపోతినిఁ దెలుపన్. ౧౫౩

కొనితెచ్చితి నిదిగో! యీ
తని వెంగలి వేస మంచతఁడు గాన్పింపం
గని పెద్దగడ దీర్ఘాలో
చనపరుఁడై యలఁతి తడవు శాంతత నుండెన్. ౧౫౪

క్రిమముగ నున్మత్తునికథ
విమృశించి పరామృశించి వేమారులు “ని
క్కముగ నిది వ్యాసఘట్టమె
సుమి” యని లోలోన నవ్వుచుం దలయూఁపెన్. ౧౫౫

తన కావీటెండి కతన్
వినిపించిన వానికాత్మ విరచితమగు వ్యా
ఖ్యను వినిచె నరఁటిపం డొ
ల్చిన గతిఁ దెల్లముగ మంత్రిశేఖరుఁ డంతన్. ౧౫౬

“భగవానుం డగుబాదరాయణుఁడె యిబ్భంగిన్ స్వకీయాత్మజుం
డగు పాండుక్షితిపాలువంశ్యుఁ డగువత్సాధీశుపైఁ బ్రీతిచే
నొగిఁ దత్సాధనమంత్రి మగ్నమతి నా కున్మత్తవేషంబులోఁ
దగుకార్యంబుపదేశమీయఁగఁ దనంతన్ వచ్చియుండుం గనన్.

తన వేసంబిట విడుచుట
నను నీవేసంబు సాధనంబుగఁ గొని యు
జ్జని కేఁగు మనుచుఁ గటువులె;
వినవచ్చె నుపశ్రుతియును వేయేల యిఁకన్? ౧౫౮

ఉడుపులు గావివి వ్యాసులు
కడుదయ మాకొసఁగు మంత్రకవచము; దీనిం
దొడవుగ నొడలికిఁ దాల్చిన
నడలునఁ బట్టవు పరగ్రహంబులు నన్నున్. ౧౫౯

ఒడయం డభ్యుదయంబును
బడయు నటం చామహానుభావుం డనున
న్నొడు వాశీర్వాదమనూ!
పుడమిని వితగావు దివ్యమునుల వచనముల్. ౧౬౦

మా పాలి భాగ్యదేవత
ద్వైపాయన మానిమాకుఁ బ్రాపై యుండం
బ్రాపింపఁ జాలమే ము
న్నాపాండవవీరు లందినట్లె జయంబున్? ౧౬౧

తె మ్మా వెంగలిదుస్తులంచుఁ గొని మంత్రిశ్రేష్ఠుఁ డాత్మీయ కా
యమ్మందున్ ధరియించి చూచుకొని స్వీయమ్మైన రూపంబు న
ద్దమ్మందుం గుఱుతింపఁ జాలక తనుం దానై యొకింతేనిఁ జి
త్తమ్మందుం దలఁచెం జయంబిఁకఁ గరస్థంబయ్యెఁ బోయంచునున్.

పిలిపించి యంతఁ దమ ప్రభు
చెలికాని వసంతకాఖ్యు సేనాధ్యక్షున్
తెలివిపరు రుమణ్వంతునిఁ
దెలియంగాఁ జేసి మంత్రి దీని సకలమున్. ౧౬౩

మును జరాసంధు పోరికిం బోవు శౌరి
తనకు భీమార్జునులఁ దోడు కొనిన యట్లు
లా యవంతీ పురంబు పై కరుగఁ దలఁచి
యాతఁ డొందెను వారి సాహాయకంబు. ౧౬౪

తనవచ్చుదాఁక రాజ్యం
బును గావఁగఁగట్టు దిట్టములఁ జేసియుఁ ద
త్క్షణమున "శుభస్య శీఘ్రి"
మ్మని వారల హెచ్చరించె ననుసరణముకై. ౧౬౫

శ్రీ లక్ష్మీరెడ్డి పుత్త్రా!
చాలితపర! రామలింగ జనపతి పౌత్త్రా!
శ్రీలా! వేంకటరామా!
ఆలింపుము పైని జరిగినట్టి దగు కతన్. ౧౬౬

శ్రీమణక భూమికంగొని త్వరం బృతనాపతి వెంటనంటఁ, జి
త్రముగ విదూష కాకృతినిఁ దాల్చి వసంతకుఁడేగు దేరఁ బా
ర్శ్వమున మహర్షిపుంగవుఁడు సాత్యవతేయుఁడొసంగు వెట్టి వే
సముగొని మంత్రిచంద్రముఁడుసాఁగె నవంతికిఁదాఁ బ్రయాణమై.

శాలంకాయన మంత్రిసత్తముఁడు వత్సక్ష్మాపతింబట్టి "యి
వ్వేళన్ లోఁబడె నస్మదీయకరికిన్ వేఁటన్ మహాసింహ" మం
చోలిం బుచ్చిన వార్తగైకొని యవంత్యుర్వీశునిం డాసి జం
ఘాలవ్రాతము దెల్పి రబ్బురపడంగా విన్నవారెల్లరున్. ౧౬౮

విని ప్రద్యోతుఁడు దద్వా
ర్తను గ్రహియింపండు వత్స రాజ పరముగా
ననుకొనె "నెవ్వఁడు వత్సేం
ద్రుఁ గొను యౌగంధరాయణుఁడు మన" ననుచున్. ౧౬౯

కావున దానికి నుజ్జయి
నీ విభుఁడెదఁ బెద్ద మెలమినిం బొందమినిన్
ఆ వాచ్యార్థంబును దూ
తావళి స్పష్టీకరించె నత్తఱిఁ బలికిన్. ౧౭౦

అప్పటికి నమ్మకయు సందియంబుఁ బొందు
"మాయికుండైన యౌగంధరాయణుండు
సృష్టి సేసిన కృత్త్రిమ క్షితివరుండొ!
అన్యునతఁ డంచు బ్రమసిరో! యనియుఁ దలఁచె. ౧౨౧

క్షితివిభుఁడు గ్రుచ్చిగ్రుచ్చి ప్రశ్నింపఁ దొడఁగెఁ
దగ్గ ప్రత్యుత్తరములు దూతలును నిడిరి
వేసె నడ్డు సవాళ్లు భూవిభుఁడు మరలఁ
జరులును దదుత్తరంబులే తిరిగి యిడిరి.

అనుకొను మ్రింగరానికడి యంచు; మరిం గొఱకంగరాక ప
ల్కొనలకు బిట్టెదుర్తిరుగు కొబ్బరికాయగ దేని మర్త్యుఁ డెం
చును; స్వకరస్థమైన నది చూడఁడు చిక్కిన యట్లు; సంశయిం
చును దనభాగ్యముం గుఱిఁచి; క్షోణి నిదేవిధి మేలివేళలన్.

పూర్వపక్షంబుపై వేసి పూర్వపక్ష
మాతఁ డొక్కింత తడవు సిద్ధాంతపఱచె
సమర సమ్మర్దమునఁ గేలు జాఱిపడిన
వారిడిన వత్సపతి వీణెఁబట్టి తుదికి. ౧౨౪

మొద లిట నొక పాదంబును,
దదుపరి యర్థంబు, నా పిదప ముప్పావుం,
దుదికిం బూర్ణంబుగఁ బతి
కెదఁగల సంశయము విచ్చె హిమము విధమునన్. ౧౨౫

ఆ వార్తం గొనితెచ్చువారి కపు డర్హంబైన సత్కారముల్
కావించెన్; నిజయోధపంక్తికి బహూకారంబు లర్పింపఁగా
భావం బందుఁ దలంచెఁ; బందువులు సల్పం జేసెఁ బట్నంబునన్
యావత్క్షోణి లభించినం గలుగఁబో దాహర్షమాత్రేనికిన్. ౧౩౬

శ్రీవత్సరాజదూతిని
నా వీణెను నృపుఁ డొసంగె నామోదముతో
శ్రీవాసవదత్తకుఁ ద
ద్భావి స్నేహానుకూలతా తత్పరుఁడై. ౧౭౭

ఈలోపున నందలమున
శాలంకాయనుఁడు వత్సజనపతిఁ గొని యా
ప్రోలికి వచ్చుచు నున్న
ట్లాలించి జనంబు వచ్చి యహమహమికతోన్. ౧౭౮

"ఇతఁ డొక్కొ శతానీకుని
సుతుఁ? డుదయనుఁ డితఁ డొక్కొ? క్షోణీచంద్రుం
డితఁడొకో? వత్సక్షితిపతి
యితఁడొక్కొ? ప్రతాపతపనుఁ డితం డొక్కొ? ౧౭౯

కాయం బానఖశిఖమును
గాయంబుల నిండి నెత్త్రుగాఱుచు నున్నన్
మాయురె? పూచిన మోదుగు
చాయను గనువిందుగొలుపు క్ష్మాపతి మాకున్. ౧౮౦

వడలిన లావణ్యముతో
సడలిన మైబిగువుతోడ జనపతి వలలోఁ
బడినట్టి సింగమనఁగనఁ
బడుఁ దేజము తొంగిచూడ వానికనుఁగవన్. ౧౮౧

తోఁకచిచ్చట్లు రేఁగి శత్రుక్షితీంద్ర
రాజ్యములఁ గాల్చు ప్రద్యోతరాట్ప్రతాప
వహ్ని చల్లాఱిపోవును వత్సదేశ
సీమములయందుఁ దానయి చిత్ర మిద్ది. ౧౮౨

వేనినిఁ దేఱిచూడఁ బరవీరులు గొంకుదు రాత్మఁ; గాంచఁగా;
వేనిని దృష్టితాఁకునని భీతివహించును మిత్త్రకోటియున్,
వేనికినై తపింత్రు చలివెల్గును జూడఁ జకోరికల్ వలెన్
మానిను;లాతఁడీతఁడెసుమా! యనుకొంచును గాంచి రాతనిన్.

శాలంకాయనుఁడాక్షతాంగుఁడగు వత్సక్ష్మాపుఁ బ్రద్యోతభూ
పాలాజ్ఞం బిలిపించి వైద్యవరులన్ స్వస్థాత్ముఁ గావించి క్ష్మా
పాలార్హంబగు మన్ననల్ నడప నేర్పాట్లన్ రచింపించి త
త్కాలంబందు వసింపఁజేసె నొకబంగార్మేడలో నాతనిన్.

ఒకరుఁడు స్నానమాడుతలఁ పూనఁగఁ దోఁడును వేఁడినీరు; వే
ఱొకఁడుధరింప దువ్వలువ లుజ్జ్వలభూషలు దెచ్చియిచ్చు; నిం
కొకరువుఁ డారగించుటకు నుత్తమభోజనమున్ రచించు; సే
వకులిటువత్సరాజుఁ గొలువం గను సన్నల వేచియుండిరిటన్.

అడుగులకు మడుగు లొత్తుచు
నడిగిన యది సృష్టిసేసి యైనను నుడి వెం
బడిఁదీర్చుచు రెండవ తమ
యొడయనివలె నతనిఁ గొలుచు చుండిరి వారల్. ౧౮౬

ముని మాపుల నాటేనికి
దినదినమును వచ్చి దృష్టిదీయుదు; రొగిఁ దు
మ్మినను "చిరంజీవ" యటం
చనుదురు ముదిముత్తయిదువలా ప్రభు నాజ్ఞన్. ౧౮౭

యువరాజను బగిదిని నా
అవపాఠిణమునట్లు స్వీయ మగనంగములో
నవయవమును జందంబున
నవంతిపతి వత్సరాజు నాదృతిఁ జూచున్. ౧౮౮

తొలి వేనిపేరు సెవులకు
ములికివలెం గ్రుచ్చుకొనుచుఁ బుట్టించెను నొ
వ్వల యమృతధారయై యది
కలిగించెను నేఁడు హాయి క్ష్మాకాంతునికిన్ ౧౮౯

అవసరంబువట్టి యక్కఱచే నేఁటి
శాత్రవుండు రేఁపు మిత్రుఁడగును
ప్రకృతిచేత నొకఁడు బాంధవుండును గాఁ;డొ
కండు శాత్రవుండు గాఁడుగాదె! ౧౯౦

ఆవంతేనిఁ గొఱంత గల్గనిగతి న్నత్యంత మర్యాదతో
యావన్మందియుఁ దన్ను శతృవలెఁగాఁ గాల్మియుఁగాఁ జూచినన్
సౌవర్ణంబగు శృంఖలాచయముచే సంబద్ధుఁ గావించి న
ట్లావత్సక్షితిపాలుఁ డెంచుకొనె నన్యాధీనతన్నంటచేన్. ౧౯౧

చెఱసాల పేరువడయని
చెఱసాలగ నతఁడు దలఁచు స్వీయంబగు బం
గరుమేడ; నెంచు భటతతి
నఱేఁదిగ యామికులుగాని యామికులనియున్. ౧౯౨

తన మేడకు నద్దైన వే
కనులు గలుగు భటకదంబకము చేతుల వి
చ్చిన కత్తులూని రేబవ
లును గావలి కాయు నట్టులు విభుం డరసెన్. ౧౯౩

తను బంధించుటఁ జేసి యొక్కఱ పరిక్రోధంబూనుఁ బ్రద్యోతుపైఁ
దనుమర్యాదగఁజూచుచుంటనుద దౌదార్యంబెదన్ మెచ్చు;భూ
పునికిన్ నమ్మినబంటులై తనకుఁ గొల్వుం జేయు నా కింకరా
ళినిమన్నించును దత్ప్రవర్తనకునోలిన్ వత్సరాజయ్యెడన్. ౧౯౪

ఒకసారి ఱెక్కల నూఁగించుచును మింటఁ
బఱచెడు పులుఁగుల బంతిఁగాంచి
ఒకసారి సురగాలి వక వకలై కడుం
గడుఁ జౌఱు తెంచు మేఘములఁ గాంచి
ఒకవేళ స్వాభ్యస్త యోగబలంబున
వినువీధి నడయాడు మునులఁ గాంచి
ఒకవేళ యంత్రబలోద్ధతిపై నాక
సమునఁ బర్విడు విమానములఁ గాంచి
తన్నుఁ దప్పించికొని పోవ ధరణి విభుఁడు
వారి వారి సహాయంబుఁ గోరు చెడఁద
నదనుకై వేచియుండె దైవానుకూల్య
మునకు నెంతేనిఁ దపియించు కొనుచు నటనె. ౧౯౫

౬

శ్రీ రమాకుమార జిదూప్రపవై భవ!
పోషితార్థి సుకవిబుధ వరేణ్యా!
దాన విజితకర్ణ! మాననీయయశస్క!
అవధరింపుమయ్యా! యీపయికత. ౧౯౬

తొలుతందానుదలంచుచందమునఁ బ్రద్యోతుండుశిష్యాత్వముం
నలిగింపంగఁ దలంచి కన్యకకు నూత్నప్రాయలీలా సము
జ్జ్వలకావాసపదత్త కాయుదయన క్ష్మాపాలునిన్ డాసి ముం
దలనం ప్రాంజలియై యతం డడిగి యోగక్షేమ మా పిమ్మటన్.

తన కూఁతురి నెఱగించియు
వినయంబున విన్నవించి వీణాగానం
బును గఱపుమనుచు నర్పిం
చెను; మదనుం డిరువురికిని సేసలు సల్లెన్. ౧౯౮

తలవని తలఁపుగ ఱేనికిఁ
దలిరుం బోఁడికిని స్మరనిధానము లచటన్
సులభంబుగ లభ్యపడెం;
దెలియునె యేవేళ కేయదృష్ట మొదవునో? ౧౯౯

కనులెత్తు నొకతూరి యాగురువరుం గాంచంగఁ; దోడ్తోన వ్రాల్చునుజిత్తంబుగలంగఁ; గ్రేవలఁకుఁజూచున్; జూచుచుం ద్రిప్పుచోఁ దనచూపుల్ గురుచూపులుంగలియనాత్మన్ నవ్వుకొంచున్ మఱల్చును శ్రీవాసవదత్త తండ్రికడఁగూర్చున్నట్టి కాలంబునన్.

కంత దఘ్నంబు కోపంబు గలిగియున్న
నాయవంతీశుప్రార్థనం బాదరించె
నలరు విల్తుండు దన డెంద మందుఁ జొచ్చి
పెట్టిదం బైన యాజ్ఞఁ గావించు కతన. ౨౦౧

లలితప్రియాకారా
దుల నన్యోన్యాత్మలందుఁ దూఱిన యవ్వా
రల శైష్యోపాధ్యాయిక
యిల నేగతి సాఁగునో! యదీశుఁడె యెఱుఁగున్. ౨౦౨

మఱునాఁడె మంచిరోజని
స్థిరపఱచి యవంతివిభుఁడు సెలవుంగొని కూఁ
తురిఁగొని వెడలెను; నవ్వుచు
గురుండు దీవింప మ్రొక్కి కోమలియుఁ జనెన్. ౨౦౩

తన పయ్యంటనుబట్టి వెన్కదెసకుం దన్నెవ్వరో గుంజుచుం
డిన చందంబున, నేరలో పిలుచు మాడ్కిందన్ను, నక్కన్య ని
ల్చును మార్గంబునఁ;ద్రిప్పఁగ శ్యతిమిరస్తోమంబు వాయంగ మ
బ్బునదోబూచులనాడుజాబిలికిఁ దమ్మోండైన నెమ్మోమునన్.
తరుణీ సరోజినీ ముఖ
సరోజగంధంబు వలచి తన్మాపతి దృగ్బం
భరచయము వెంట నంటెను
బరమామోదంబు పారవశ్యము గొలుపన్. ౧౦౫

తెలవాఱు నెప్పు? డాక
న్నెలమానిక మెపుడు వీణె నేర్వంగా నా
వలనికి వచ్చునో? యని పతి
తలంచె; నా చెలియు నట్ల తమకించెఁ జనన్. ౧౦౬

తనరాకన్ మునుముందుగాఁ జెలులచందానన్ నివేదింపఁగాఁ
దనమైతావులు, కాళ్లు జవ్వనపు మత్తాచేతఁ దొట్రిల్లఁగా,
వెనుకన్ లాఁగఁగ సిగ్గుదొంతరలు, తద్వీక్షాభిలాషంబు ముం
దునకుం ద్రోయఁగ డాసెఁ గన్య నృపచందున్ వల్లకీశిక్షకై.
తన ఘోషవతీ వీణను
గొని వాసవదత్తవచ్చి కూర్చుండఁగఁ జెం
తను గన్యాప్రియముతోఁ
జనుదెంచిన పలుకు వెలఁది చందమునఁ దగెన్. ౧౦౭

తొలినాఁ డాచెలి నిల్చె దేశికునికిన్ దూరప్రదేశంబునన్
మలినాఁడొక్కరవంతముందుజరిగెన్;మర్నాఁ డింకంగొంత ముం
గలికిన్; నాలవనాఁడు మిక్కిలియు సాఁగంజొచ్చె మున్ముందు; క
వ్వాలఁ గొన్నాళ్ళకు వానియంకతలముం బ్రాపింప నుంకించెనో!

తోలినాఁ డూఱక గురు పలు
కులువిని తలయూఁచె; నెలమిగోని యూఁకొట్టెన్
మలినాఁ; డాడెను బదు ల
వ్వలినాఁ డోగి; మాట గలిపెఁ బైనాఁడు దగన్. ౨౧౦

వలపుల్ చిమ్ము కటాక్షమాలికల నా పద్మాక్షి యాతేనిఁ జ
క్కిలిగింతల్ కొలిపెంగడింది; నగుచుం గ్రేళ్వాఱు గ్రేగంటిచూ
పులతో వాసవదత్త యంగకములన్ ముద్దాడు భూజాని; వం
తులు వారిద్దఱు వేసికొన్నకరణిన్ దోఁచున్ విచారింపఁగన్.

చెలఁగి కొనిన్నిటి కెదు రెక్క చేప వోలె
నతని చూపున కెదు రెక్క నతివచూపు
నెలకు నెగఁబ్రాకు వెన్నెలపులుఁగు వోలెఁ
బతిమొగంబున కెగఁ బ్రాకెఁ బడఁతి చూడ్కి. ౨౧౨

పరిమదంబాఱ గురుండు గ్రొత్త కృతుల్గ వాయించి
చూపించు వ్యా
జముతో వాసవదత్తవీణఁ గొనుచుర్ స్పర్శించు నాకన్యహ
స్తము; దానం బులకించి మై మఱపునం దాఁకించుఁ బైకొంగు నా
యమయు; న్నివ్విధినేర్పు శిష్యకు నుపాధ్యాయుండు
పాఠంబుల్గ. ౨౧౩

కడకంటి చూడ్కి పోట్లకు
జటవేరిటుల, లేతనవ్వు సవరింతలకుర్
ఒడలియొయారంబుల నా
పడంతి తోడ్తో నొసంగుఁ బ్రీత్యుత్తరముర్ ౨౧౪

పతి కొలది తడవులో న
ద్భుతమగు వేగంబున స్వరములు జంట లలం
కృతి గీత వర్ణ కృతు ల
ప్రతిమాన ప్రజ్ఞమైన రమణికి నేర్పెన్. ౨౧౬

గురువదనారవిందమునఁ గ్రమరీవిధమున్ వహించి యా
సరసిరుహాక్షి శిక్షణము సల్పుతఱిం గృతి మీటు మంచుఁ ద
న్గురుఁడడుగంగ నొక్కపరి నొక్కను వర్ణము; గౌరవర్ణమున్
అతిముఱి మీటుజావళి లయ శ్రుతిశుద్ధికి సున్న వెట్టుచున్.

మరియొక్కసమయమునఁ గి
న్నెరమీటుచు మీటుచుఱక నింగిని మీటున్
గరమున; నాచార్యుం డా
సరసత్వంబున కెడంద సమ్మదమందన్ ౨౧౭

తరుకొమ్మ చిగుర్చును వ
త్సరమున కొకపరియె; గురువసంతుని మహిమన్
ధరసీకొమ్మ, చిగుర్చుచు
విరిదొడుగుచు నుండె నెల్లవేళల యందున్. ౨౧౮

లలనకు వీణాకళతో
వలవులు దివసక్రమమున వర్ధిల్లెను మి
క్కిలి; లజ్జ లొజ్జు వడియెను;
వలరాజు కలంపఁజొచ్చెఁ బట్టి యెడందన్. ౨౧౯

చదువను పేరిడుకొని చని
యుదయనునే చుట్టుకొనుచు నుండును సతమా
మదవతి వెంపరలాడుచు
హృదయంబునఁ, దేనె తెట్టె నీఁగయుఁ బోలెన్. ౨౨౦

కలిసెను డెందంబులు; వా
క్కులు గలిసె నొక ళ్లొకళ్ళ; కూర్మిని గాయం
బులు గలియఁ దలఁప నొకపరి
చలపాదిగ దాసివచ్చి సతిఁ గొంపోయెన్. ౨౨౧

౭

శ్రీపారల పల్లీపతి!
శ్రీపతిపాదాబ్జయుగళ భృంగితమతి! వి
ద్యాపతి! వేంకటరామా!
ఆ పైకథ నవధరింపు మయ్యా! యెలమిన్. ౨౨౨

సంగీతంబది నాఁడునాఁటికిని హాస్యంబయ్యె నా శిష్యకున్,
సంగాతం బతిదీర్ఘమయ్యె గురుతో నానాఁటికిన్; దత్క్రియల్
రంగారెందగ మూఁడుపూవులునునారాకాయల్ విధంబొంది;స
ర్వాంగీణంబుగ వారలొండొరులలో వ్యాపించిరొక్కుమ్మడిన్.

గురుదక్షిణ నిమ్మని శి
ష్యురాలిఁ గోరంగ నవ్వు చొజ్జ చతురిమం
గరలత లాతని మెడ నిడి
పరిరంభ మొనర్చి యొసఁగె వాతెఱఁ బ్రీతిన్. ౨౨౪

తేరకుఁ దేరగఁ దేటులు
పారని తంగేటిజుంటి వడుపున నచటన్
వారొండొరులకు దొరకిరి
వారలదగు పూర్వపుణ్య ఫలపాకమునన్. ౨౨౫

తనదా ఘోషవతిఁ స్వకీయముగ నాతన్వంగి గైకొంట న
జ్జనపాలుండు దలంచి వీణియగ నాచంద్రాస్యనే యారు నాఁ
గను దండంబును హారతంత్రులుఁగుచాఖ్యం బొల్చు తుంబీఫలం
బునువీక్షించిసతంబుమీటుకొనుచుఁ మోదించుచుండుంగడున్
నడకలఁ గ్రొత్తక్రొత్తరచనంబుల నేరుపు; నాటపాటలం
గడుఁగడుఁ బాఠభేదముల కల్పనఁజూపును వేషభావలం
గడుకొని మేలిచందములఁ గన్పఱచుం దనశిష్యురాలి కా
పడుచుగురుండు; శిష్యగురు భావము లివ్విధికిం దిగెం దుదిఁ.

ధరియించి పావడా నరుదెంచు నొకతూరి
చేరు వేఱొకసారి చీరఁదీర్చి
తొడిగి మైబంగారుతొడుగు వచ్చు నొకప్డు
విరులుదాల్చి మరొక్కవేళ డాయు
విచ్చేయు జడయల్లి వెండ్రుకలొకమారు
వేంచేయు నొకపరి విరియఁబోసి
కైసేసివచ్చును గస్తూరి నొకపుడే
తెంచు వేఱపుడు చెందిరము దిద్ది
మార్చి మార్చి యిట్లు మవ్వంపుఁబోఁడి ర
త్నాంబ రాదు లహారహంబుఁ దాల్చి
నప్పగించుచున్న చొప్పున గురుఁ డిచ్చి
నట్టి పాఠములను నప్పు డపుడె. ౨౨౮

కనువిందై తగ విప్పుకొన్న పురినాఁగఁ గేశజాలంబు చ
క్కని చిత్రాంబరముం ధరించికొనిరాఁగాఁజూచియాచార్యుఁడా
వనితారత్నము నెమ్మినింబలెనె యాహ్వానించి లాస్యంబొన
ర్పనుదాళంబులు దట్టఁబూనును గరద్వంద్వంబునన్ నవ్వుచున్.

మదగజయానముతో న
మ్మదితామణి వచ్చుతఱి నృపుఁడు ఘోషవతిఁ
ముదమున మీటఁ దొడంగును
మదగజసంగ్రహణ చతురిమముగల గీతిఁ. ౨౩౦

తేనె లొలుకంగ మాటాడు తీవఁబోఁడి
నడుగుఁబలి "నీకుఁ జిల్క యేమగు" నటంచుఁ
బంచమశ్రుతి గొంతెత్తి పాటఁబాడ
"బికముడాఁగెనె నీదుకుత్తుక?" నటంచు. ౨౩౧

ధరనాఁటికొన్న కూర్పరమునం దలనుంచి
 యొత్తిగిల్లి పరున్న యత్తెఱంగు
జలకంబులాడి కైశ్యంబును దడియార్ప
 నెఱిఁదీర్చుకొనుచున్న నేఱితనంబు
అనవశ్యముగనె యొయ్యారంబు లొలుకంగఁ
 బయ్యెద సవరించు పనితనంబు
ఎలజవ్వనపుఁ దిమ్మిరులచేతఁ ద్రుళ్లుచు
 నోడలని విఱుచుకొన్ కడిఁదిబెడఁగు
కందుక క్రీడలాడు చక్కందనంబు
తరుల కెఁగఁబ్రాఁకి పూల్గోయు సరసతనము
కన్నులకుఁ గట్టినట్టు లాత్మ్రావరుండు
వ్రాసి చూపించు స్వీయచిత్రములె సఖికి. ౨౩౨

నిలువం బెట్టియు నొక్క కంబముకడన్ నేత్రుండు వర్ణించు నా
చెలిఁ 'దత్తస్తంభము పల్లవించె' ననుచున్ జేర్పించి కుడ్యంబున
ర్మిలిఁ 'దత్రస్థముచిత్ర' మంచునిచియున్ వృక్షప్రకాండంబునం
'దెలపూఁదీవ' యటంచు నొక్కొకతఱి న్నెం తేని ముగ్ధాత్ముఁడై.

అతిగుప్తంబుగ వచ్చి దేశికుని నేత్రాంభోజముల్ మూసె నా
సతి; యాతండును వెన్కవైపునకుహస్తద్వంద్వముంద్రిప్పి యా
సతికిం జక్కిలిగింతవెట్టె నవశస్వాంతంబునం ద్రుళ్లుచున్
దతమోహంబునఁ గౌఁగిలించుకొనె నాతన్వంగియాచార్యునిన్.

తలదువ్వు; ముడుచుఁబువ్వులు;
తిలకంబును దిద్దు; మేనితీవకు నలఁదుం
గలపంబుల; నాచార్యుం
డల శిష్యామణికిఁ దత్క్రియలఁ గఱపుగతిన్. ౧౩౫

సకియా! ముద్దిమ్మనఁ బతి
తెకతేరగ దొరక దని విదిల్చిన యువతిన్
ఒకటికిఁ బదిరెట్లగు వ
డ్డికి నిమ్మని కోరికొని వడి న్నది తీర్చెన్. ౧౩౬

అఱకౌఁగి ళ్ళఱముద్దులు
నఱమోవులు మాత్రి మొసఁగి యవలికిఁజను నా
నెఱజాణ గంతువేయుచు
నురుమోహము రేపి ప్రియుని నువ్విళ్లూర్పన్. ౧౩౭

ప్రియునితోడం దలాఁడగను బ్రేయసిపండుకొనుం; దదీయ వా
చెయి మెడచుట్టువేసికొనుఁ; జేరులుగా దన కేలుదోయి నా
ప్రియుగళమందు వ్రేలు గొను బిగ్గకవుంగిలి;నొత్తుకొంచు దా
మెయిమెయిఁగూరుచుండునుదమిం; దనివింగొనదే మొనర్చినన్
తమముఖచంద్రబింబముల దట్టపు వెల్గుల పిండుచేత సం
తమసము మందిరాంతరమునంజొఱమిన్ గ్రహియింపకింతి సా
యమువడినన్ గురున్ విడిగృహంబున కేగక క్రొత్తక్రొత్త పా
ఠములను నభ్యసించుచు నటన్ వసియించును బొద్దువోయినన్

పరిచయమైన కొలందియు
గురునికడం జొరవ హెచ్చెఁ గొమ్మకుఁ జదువుల్
కఱపంగఁబూను నతనికె
గురుమించిన శిష్య యంచు గురుఁడే మెచ్చన్ ౨౪౦
ఇత రేతరసౌందర్యా
మృతమును సేవించుకతన నిరువురకుఁ దగన్
మితిమీఱిన యాటలునున్
శ్రుతిమీఱిన పాటలును విశోభిలుచుండెన్. ౨౪౧
సకలకళలందుఁ బాదరసంబు వోలెఁ
బఱచు నీబుద్ధి యని మెచ్చి గురుడు పలుక
"నిది గురుకటాక్షమే కాక యెంతదాన
నే" ననుచు శిష్యురా లానతిచ్చు నగుచు ౨౪౨
తరుణి! గుఱ్ఱపుపిల్ల చందమున నీవు
కదను ద్రొక్కెదు వెంతేని గంతు లిడుదు
వనుచుఁ బ్రియుఁ డాడ, బదులాడు నాలతాంగి
రాతునుం బట్టికాదె గుఱ్ఱం బటంచు. ౨౪౩
గురు డాయుట కున్నంతటి
త్వరకాళులఁ గానఁబడదు వదలెడు నదనన్
జరుగవు ముందున కడుగులు;
జరిగినఁ జెలిదృష్టి వెనుక చిక్కికిఁ దిరుగున్. ౨౪౪
కనులంబుప్పొడిరాలెనూఁదుమనియక్కాంతాలలామంబు మ్రో
లనునిల్చెఁ; మొగిడించి మోవిఁబతి చాలాసేపు తానూఁదెఁ; నూఁ
దిన బాధ న్నటియించు చాయువతి న ర్తించుచుఁ సమీపించి చ
న్మొనలఁ వానియురంబునం బొడుచుచున్ భూపాలుఁడూఁదంగఁగన్

పొలయలుకల, సాంత్వనముల
గిలిగింతలఁ, గౌఁగిళులను, గేరడముల, ము
ద్దుల, సుద్దుల, దిద్దులఁ, బొ
ద్దులఁ బుత్తురు వారు హద్దు తొలఁగఁగ నిచ్చల్. ౨౪౯

వలసిన వా తెలవిందులు
వలసినఁ గౌగిళ్లు హద్దు వడయని ముద్దుల్,
కలవే దొరకని వవ్వా
రల కాస్మరకల్పతరువరము వరమిూనన్. ౨౪౭

చిలుకయు గోర్వంకయు వలె,
లలితంబగు గువ్వజంట లాఁగున, మఱియున్
నలకూబర రంభలవలెఁ
గులుకుచు నీ జంట తిరుగుఁ గోరిన యెడలన్. ౨౪౮

కనుగ్రేవల్ మెలికల్ వడన్ రదనపుం గాంతుల్ ప్రతీక్షించివే
శను మెల్లంగలియంబడన్ దడబడన్ లాలింపఁగేల్దోయి యా
ననముల్ పైబడఁ వా తెలల్ ముడివడన్ సౌఖ్యాబ్ధి నోలాడుచుం
ద్రనయంబుం గురుశిష్యురాండ్రు; రిటురుచ్యంబౌనె యేవిద్దెయున్?

చిక్కి కూర్చుండును జిలుకబోదయుఁ బోలె
రమణు వక్షఃపంజరంబునందు
ఉయ్యాల లూఁగుచునుండు మోదంబుతోఁ
బ్రియుని బాహాలతా ద్వయమునందు
ఈఁదులాడుచునుండు నించురాయంచయై
పతితనుశ్రీ సరోవరమునందుఁ
బెనవేసికొనియుండుఁ దనమేనితీవను
గాంతుని కమనీయ గాత్రమందు

పసిఁడి మొలనూలి చందాన బాహుయుగము
ముద్దుచెలికాని యవలగ్నమునకుఁ జుట్టు,
మెలిక వేయును దన కేలఁ జెలువు కేలు
మోహమున మున్గి తేలు చాపువ్వుఁబోఁడి; ౨౫౦
పూల చేరుల తూఁగుటుయ్యాల లందు
యువతిఁగూర్చుండఁ బెట్టి జేఁడూఁపి యలయఁ
దనదు నొడియందుఁ జేర్చి యా యనుఁగుకానిఁ
బూలవింజామరల వీచు నా లతాంగి. ౨౫౧
విరితూపు, చెఱకువిల్లును,
గరదండమునందుఁ దాల్పకయు వచ్చి ననున్
వెఱగొలిపి గెలుచుకొంటివి;
అరరే; మొనగాఁడవీవె! యని చెలి మెచ్చున్. ౨౫౨
కసరినను డాయు; డాసిన
విసరును దవ్వులకు వెలఁది; విసిరిన దానిన్
ముసురుకొనున్; సయ్యాటల
రసమెఱిఁగినవారు శిష్యురాలుం గురుఁడున్. ౨౫౩
ఒడయని మ్రోలన్నిలఁబడి
విడియం బందించుచుండె విరిఁబోఁడి; యతం
డాశిక మగుదాని చెక్కిలి
దుడుకుమెయిం గోటఁమీటఁ దొయ్యలి యంతన్. ౨౫౪
తనదు నునుఁజెక్కు క్రొత్త వ్రాఁతలు చెరుగుటఁ
బఱచిరుసరుసలాడు చానలకుఁ ద్రిప్పి
నెమ్మొగముఁ దమ్మి, వైచియు బొమ్మముడిని
మూతి బిగియింప బతిమాలె భూపుఁడిట్లు. ౨౫౫

కినుకం బూనితివేని నాపయినిఁ గల్కీ! పట్టి బంధింపుమా!
నను నీ సుందర బాహుపాశమున; నంతన్ నీదు వక్షఃస్థలీ
ఘనకారాగృహమందుఁ బెట్టి కసిపోఁగా నన్ను శిక్షింపుమా!
కొనఁ గన్నీయిడు శిక్ష సిద్ధముగ నేఁగూర్చుంటి నీ సన్నిధిన్.

నీ పూలదండఁ గైకొని
కోపము శాంతిల్లునట్లు కొట్టుము; కాదేన్
మోపెట్టి నీదు బొమవిలు
చూపుం దూపులను గురియఁ జూడుము నాపై. ౨౫౭

చెరిగెను జెక్కిట వ్రాసిన
విరిగుత్తి యటంచుఁ గినుక వెట్టుదె? తరుణీ!
విరచింతుఁ జిత్రవిద్యా
పరమావధి మోహనంపుఁ బలు చిత్రరువుల్. ౨౫౮

గగన శృంగారతటిని నౌకపయి నెక్కి
రోహిణీ చంద్రు లరుగొ! పెన్ రుచిని గలిసి,
విశ్వమోహన గీతులు విసరుచుండి
మనము నట్లె పోవుదము రమ్మా! లతాంగి! ౨౫౯

ప్రాంతముననున్న మావిపైఁ బ్రాఁకఁబోక
కాంచుమా తీవ యెట్లు కంపించుచుండెఁ?
గుసుమ పాత్రింబులోఁ దేనెఁ గ్రోలు చవిగొ!
పడఁతి! విహరించు భృంగదంపతులఁ గనుము! ౨౬౦

సన్న బంగారు తీవియ సాఁగఁదీయు
చున్న మెలికలు చుట్టు కొన్చుండు మాత్రి
స్వర్ణకారుండు విడువఁ డాపనిని బాల!
పట్టు విడువక తుది వశంపఱచికొనును. ౨౬౧

కలువ వాల్గంటి యల శీతకరునిఁ గనక
నీవలెనె మూతి బిగియించెనే? లతాంగి!
అనుచుఁ గేదంగి ఱేకును నతఁడు విసర
మరుఁడు ములికినివలె బాల వఱచె దరికి. ౭౯౨

డాసి మనఃప్రియుఁ గని సరసుఁడా! క్షమియింపుము నాయొనర్చునీ
దోసము; నిన్ను రిత్తగనె తూల్చితినేవలవంత లందిగో!
బాసలొనర్తు నీపదము వట్టి యిఁకెప్పటికల్ల నన్నయా
వాసవదత్త లాఁగికొని వత్సమహీశుఁడు కౌఁగిలింగొనెన్. ౭౯౩

తనకుఁ నేర్పుచు వీణెపాఠమును జెంతన్గొల్వజ్జ గూర్చుండి దీ
నినివాయింపుము; దీనిమీటుము నను మెచ్చింతువేన్ నీకుపా
యనమిత్తున్నని మీటుచున్న తను ముద్దాడంగ, మేల్మేల్ లభిం
చెను మాదొడ్డగురుండునా కనుచుముంచెన్ శిష్యచిర్నవ్వులన్.

కొసరును దగఁ జిర్నవ్వును;
గొసరుం గెమ్మోవి; ముద్దు కొసరుఁ; గవుఁగిలిం
గొసరును జెలికాఁడా చెలిఁ
బసగల దట కొసరులొనె; వానికె తెలియున్. ౭౯౪

చెవి విందులుఁ గనువిందులుఁ
బువువిల్తుని మధుర మధుర మోహపు విందుల్
యువతీయువకుల జంటకుఁ
బ్రవర్తిలెను బంధుగులను బంధుగులువలెన్. ౭౯౫

ఎగవిడిచిన చందంబున
నెగఁబడి తా కొండొరువుల కెదఁ దరితీపుల్
మిగులం గా వగ లాఁడియు
వగలాఁడకుతో భయంబు వర్తిల్లిరిటుల్. ౭౯౬

వారించెడు ప్రద్యోతుఁడె
వారిని వార్వములఁబోలె వదలంగా న
ల్లేరు పయి బండి సాఁగిన
ధోరణితో నడిచె వారి తుందుడు కెల్లన్. ౨౬౮

పగ లొక్క నిమేషార్ధం
బుగఁ గల్ప ప్రాయముగను బొలిచెను రేయున్
పగలానికి పగలాఁడికి
నగు నిది కందర్పమాన మనియండ్రు బుధుల్. ౨౬౯

తన కీ చందంబునఁ జు
బ్బన చూఱఁగ ననుభవించు వరఖని గురు పే
రున నర్పించిన తన జన
కుని దయ నాబిడ్డ పొగడికొను నిత్యంబున్. ౨౭౦

పలుకందుం దడఁబాటు, మై నలుగుడుల్, పల్లొత్తులుం, గాంచి నె
చ్చెలు లావాసవదత్తచందమును నిశ్శేషంబు మూచూచి తా
ర్మెలమెల్లంజని తెల్పఁ దల్లియును దండ్రిన్ నవ్వుకొం చాత్మలన్
ఫలియించెందమయత్నమంచునుగడుంబ్రాపించి రానందమున్.

తనువంచించి యరణ్యమందు గజతంత్రంబుం బ్రయోగించి తె
చ్చిన ప్రద్యోతుఁడు గీడుసేసె నని మున్ జింతించు వత్సేశుఁ డా
త్మను నేఁడెంచె నిఁకెన్ని జన్మములకున్ మల్లింపరానంత మే
లునుగావించెనునాకు; వచ్చుఁగద కీళ్ళున్ మేళ్ళ కేయంచునున్.

ఒడయఁడనంగ సౌఖ్యముల నుయ్యెలలూఁగుచు సంతతంబు న
క్కడిచెఱసాల నందనముగా నలవాసవదత్త రంభగా
నెడఁగొని యిల్లువాఁకిలిని నెంచఁ డొకప్పుడు; నింటికంటె నుం
గుడిపదిలంబుపొమ్ము మదిఁ గుందువహింపఁగనేల వానికిన్.

మెలమెల్ల న్నృపుఁడాకళించుకొనియెన్ మిథ్యాగజవ్యూహపున్
ఫల మీవాసవదత్తతోఁ దనకు గాంధర్వం బకా స్వాత్మలం
దలిడండురిల్ రచియించుకొన్న యొక పన్నాగంబుగా;నన్యథా
కులకన్యం బిత యిట్టులేల తనకుం గూర్పంగ నుంకించెడున్?

అల ప్రద్యోతుఁ డొనర్చిన
ఛలంబునకుఁ దగ్గపెద్దశాస్తిగఁ గొంపో
వలె వాసవదత్తను గ
న్నులఁ గారముఁగొట్టి భటజనుల కనితలఁచెన్. ౧౭౫

మనమునఁ గూఁతురు చుట్టము;
జనకుఁడు పగతుండు; వత్సజనపాలున క
య్యెను సుమ్మ ! పాము చుట్టం
బును, బడగ పగయనుచందమునఁ గన్పట్టెన్. ౧౭౬

కనకపంజరముంబోని కనకసౌధ
మందుఁ దులఁదూఁగుచున్న సౌఖ్యంబులందుఁ
బంజరమునుండి కీరితోఁబాఱఁ దలఁచు
కీరముంబోలెఁ జింతించు క్షితివరుండు. ౧౭౭

ఇటులుండ వత్సరాట్కథ
యటఁ గౌశాంబిని మునింగి యల్లయవంతీ
పుట భేదనమునఁ దేలిరి
పటు మాయికులగు నమాత్యవర్య ప్రభృతుల్. ౧౭౮

శ్రీకర బత్తులకుల ర
త్నాకర రాకాశశాంక! యాచక కల్పా
నోకహ! వేంకట రామా!
పైకథ నాలింపుమయ్య! ప్రమదం బాఱన్. ౨౭౯

చివికియుం జివికియుఁ జినిఁగి పేలికలయి
పలుకంపుకొట్టుగుడ్డలు ధరించి
కొఱగాని దొరకిన చిఱిఁగిన పాఁతము
చ్చెలు తారుమారు కాళులకుఁ దొడిగి
పగిలి చిల్లులుపడి పనికిరాకుండిన
యొక చిన్న కడముంత నుగ్గపట్టి
పురుగు తొల్చుటఁజేసి పుచ్చి పెన్నుసిరాలు
తునిసిన యొక కట్టెతునుకఁ బూని
బిరుసువడి పెద్ద పెనగొన్న నెఱుల మొత్త
మూడ గమివోలుగడ్డంబు నొగివహించి
చంకఁ బుల్లాకు లొకకొన్ని సంతరించి
తిరుగు నొక వెంగళప్ప యా పురమునందు. ౨౮౦

ఆడుం; బాడును; వెక్కిరించు; నెదిఱోయాలించువాయించు; వెం
టాడుం; గెవ్వునఁ గేక వెట్టుఁ; గడుగ్రుల్లాడించు మిన్ జూచుచున్
ఆడించుం గను బొమ్మలం; గొణుగుహస్తాంఘ్రుల్ విరుద్ధంబుగా
జాడించుం బయ్రివాలుసీగలగొనున్ జంపున్నొడల్ గీరుకొనున్.

రుదియించున్ వికటాట్టహాసము లొనర్చుం దత్క్షణంబందె; నె
మ్మదిఁ గూర్చున్నటులుండియుండియువడిం బర్వెత్తు;నెవ్వారినో
గదమాయించును; బుజ్జగించును; దుథూకారంబుగావించు; బి
ట్టదలిఁచున్;విదిలించు; నావెడఁగు వాఁడా పట్నపున్‌వీధులన్.
అడుగునుబిచ్చ; మిచ్చినదియచ్చటఁగొంతతినున్;ద్యజించుఁగొం
తిడు నొకకొంతకుక్కలకు; నివ్విధి లొగ్గిడిసేసిపోవు; నీ
రిడ నెవరేనిఁ ద్రాగునొక యింత; సగంబెగఁ జల్లిపోవు; నె
క్కడ నెవరేని గుడ్డనిడఁగాఁగొని చింపి ధరించుఁ బేలికల్.

దొరలకు లేవఁడు; వేల్పుల
కెరగం; డెల్లరును మిత్రు; లెల్లరు శత్రుల్
పరునికి దనతోఁ దనకుం
బరుతోఁ బనిలేక తిరుగుఁ బట్నంబెల్లన్. ౨౮౪

ఇగిలించును సగిలించును
బగిలించును ముంత; నడుకఁ బ్రియతించును; శ్రీ
విగఁ గూరుచుండుఁ; గనఁబడు
బెగడినగతి; వెఱ్ఱి వేయి విధములు గాదే? ౨౮౫

వికవిక నవ్వుచు న్నతని వెంబడిపోవుచు గోచి లాగుచున్
వికటపు సద్దు సేసి జళిపించుచుఁ గవ్వుచుఁ జుట్టుపీకుచున్
వెకవెక రాలు రువ్వుచును బేరెము వారుచు వెంబడింప, నా
వికలుని దిప్పకాయలగు పిల్లలు కొందఱు మూఁగి రయ్యెడన్.

“ప్రద్యోతుని దగ్గఱ నే
నుద్యోగ మొనర్ప వచ్చి యుంటినిఁ; బదివేల్
గద్యాణంబులు గావలె;
విద్యల వాచస్పతికినిఁ బెద్దన్నఁ జుఁడీ! ౨౮౬

ఆలంకా నాయకునకు
శాలంకాయనునితోడ సంధింతునిగో!
మేలైన వియ్యమును; బది
వేలబ్బును నాకు; దాన విలుతు నవంతిన్. ౨౮౮

పదిదినములలోఁ జూడుం
డిదిగో! యీవత్సరాజు నెత్తుకపోదున్
మొదలంట నవంతీపురిఁ
గదిలింతును; జూతు నెవఁడు కాదనఁగలడో? ౨౮౯

కలిచితి నేనును యౌగం
ధరాయణుం డొక్కచోన త త్త ద్విద్యల్
ధరనతఁడు తిక్కవాఁడై
తిరుగుచు నున్నట్లు దివ్యదృష్టి నెఱిఁగితిన్. ౨౯౦

కూలంకషముగ విద్యలు
శాలంకాయనుని కేన చదివించితి మున్;
పాలంకి పిట్ట సాక్షిగఁ
దాలాంకునితోడ నని కతఁడు నిన్న చనెన్. ౨౯౧

అనుచుం బల్కుచు నాతఁడు
సనుచుండను వీధులందు జను లెవ రున్మ
త్తుని మాట సరకుసేతురు?
వినినగిపోవుదురుగాని పెట్టరుచెవినిన్. ౨౯౨

శిరసును ముండితంబుగను జేసి, మడుంగుల మున్గి, కావిచీ
వరములుగట్టి గాత్రమున, భ క్తిఁ ద్రిరత్నములం బఠించుచున్
బురమున బిచ్చమెత్తుచును బోయి విహారములందుఁబంచుచున్
గొఱలెడు నచ్చటన్ శ్రమణకుం డొకఁడెంతయు వీతరాగుఁడై.

మహిఁ జరించెడు బౌద్ధధర్మం బనంగ
నాకృతి వహించియున్న పుణ్యం బనంగ
మూర్తినింగొన్న సద్గుణపుంజ మనఁగ
శ్రమణసం ఘుజ్జయినియందు సంచరించు.          ౨౯౪

తెలిజందెంబుల జగ్గునిగ్గులు, విభూతిస్వచ్ఛపుండ్రద్యుతుల్
కలియంగాఁ బడఁగాఁ బరస్పరజయాకాంక్షన్, గళంబందు భా
సిల రుద్రాక్షలతావళంబు, భ్రుకుటీసీమంబునన్ నర్తిలం
దిలకశ్రీ నటిమో యనం దిరుగుచుండెన్ విప్రుఁ డొండాపురిన్.

తొడిక్రొంగ్రొత్తరకంపువేసములు ప్రత్యుత్పన్నధీయుక్తుఁ డా
తఁడు చేఁదాలిచి వక్రదండమును; దత్రత్యప్రజాబృందముం
గడు పుబ్బించుచు మాటమాటకు, మహాకౌతూహలాపాదియై
కడునెయ్యుండయి పెద్దపెద్దలకు నెకాఁ-లంబునన్ వర్తిలెన్.

పరిచయ మేర్పడె నతనికిఁ
బురిఁగల స్త్రీబాలవృద్ధ పురుషులతోడన్;
సరదాగా వాఁడెవుఁ డా
పురుషునిఁ బిలిపించి పొద్దు వుత్తురు కథలన్.          ౨౯౫

వికృతాలాపంబులచే
నొకరి న్నవ్వించుచుండు నొకవేళను; వే
ఱొకని న్నేడ్పించును; దుది
సకల జనంబులును వానిసఖ్యముఁ గోరున్.          ౨౯౬

ఆతనికీర్తి మెల్లమెల నాపురమంతయుఁ బ్రాఁకిప్రాఁకి, ప్ర
ద్యోతమహామహీంద్రుచెవి దూఱఁగనాసరసుండు వాని నా
హూతు నొనర్చి యాతని సముత్కట హాస్యకథాళికిన్ మనః
ప్రీతివహించివీడ్కొలిపెఁ బెక్కులొసంగి యుపాయనంబులన్.

ఈవిధముగ నపుడపుడా
బ్రహ్మవరసన్నిధికిఁ జనుచు బ్రహ్మసురుఁ డచటం
గావించు వినోదంబుల
నావాసవదత్తయు విని యాహ్లాదపడెన్. ౩౦౦
"విని విప్రునిహాస్యకథల్
వినోదపడుఁగాక వత్సపృథివీపతియున్"
అనుకొని ప్రద్యోతుండా
తనిఁబుచ్చెను దేవిసన్నిధానంబునకున్ ౩౦౧
తనప్రాణమిత్రుఁడగు నా
తని వికృతపుఁజేష్టితముల కలవడి యుంటన్
గనినంతనే ఫలానా
యనుకొని పతివెఱగుపడుచు స్వాగత మొసఁగెన్. ౩౦౨
ఉరులందు సింగ మట్టులుఁ;
గరండమునఁ గోడత్రాచుగతి; రాహుముఖాంత
తరమునఁ జంద్రుఁడువలె; భూ
సురునకుఁ బతి తేజు డింది చూపట్టెఁ జెఱన్. ౩౦౩
ఇతరేతర కుశలంబుల
ప్రితిపర్వంబుగను వినిరి; చూడఁగ నా భూ
పతివరు బరువును దీసిన
గతిఁ దేలిక వడియె నెడఁద బ్రహ్మదేవునికిన్. ౩౦౪
తమమంత్రము నామూలా
గ్రముగా వినిపించి వత్సరాజేంద్రుని చి
త్తముఁ జిగురింపించెను ద
త్సమయమున వసంతకుఁడు వసంతుని పగిదిన్. ౩౦౫

కృతకాకృతియగు విప్రుఁడు
పతియగు ప్రద్యోతునాజ్ఞ వడసియె తాన
ప్రతిరోధంబుగ నుదయనుఁ
బ్రతిదినమునుబోయి చూచి వచ్చుచు నుండున్. ౩౦౬

ఉదయనునిఁ బట్టి తెచ్చిన
మొదలుగఁ బనిముగిసినట్లు మోదము వడుచున్
నిదురించుచుండె ప్రేయిడి
యెదపైఁ బ్రద్యోతమంత్రి లెఱుఁగక యెదియున్. ౩౦౭

తిరుగులేదు తమదు తెలివికిఁ; బై చేయి
తమదె తప్పదనుచుఁ దలఁచి పెగడ
"తల్లి సెట్టి లెక్క యేకలెక్క" యటన్న
పగిది విశ్వసించి పలుకరైరి. ౩౦౮

పగటన్ వార్మగురున్ యథోచితనిజ వ్యాపారనిర్మగ్నులై
నగరంబందుఁజరించుచున్ నరపతిం దప్పించి కొంపోవఁగాఁ
దగు తత్రస్థపరిస్థితుల్ తెలియుచుం దంత్రింబులన్ సూక్ష్మబు
ద్ధిగ వేషించుచుఁగూడుచుండుదురు మధ్యేరాత్రమందొక్కచోన్.

తమ తమ కనిపెట్టిన విష
యముల నెఱింగించుకొందు రన్యోన్యం; బీ
క్రమమున రేఁ గడపి ప్రభా
తముకాఁ గ్రమ్మరుదురట యథా పూర్వముగన్. ౩౦౯

వారపాయంబులను దదుపాయములను
నెత్తులును నెదురెత్తులు; నేవొ యేవొ?
పూర్వ పక్షముల్ సిద్ధాంతములును సరవి
శేలఁ జర్చించు కొందురు చాలఁ దడవు. ౩౧౦

కొంతది కాలంబు వారు ముగ్గురును నిట్లు
కూడి మథియింప మథియింపఁ గొంత వడికి
మాయికాగ్రిణి యా గంధరాయణునకుఁ
దట్టె నొక్క యుపాయంబు బెట్టిదంబు. ౩౧౨

వినిచెఁ దానిని నిట్లా
యన; నడగిరి నామధేయమగు నా ప్రద్యో
తుని పట్టపేన్గు గలదని
వినరే! దానికిని రేపు పిచ్చెత్తింతున్. ౩౧౩

దానన్ దంతి పెకల్చి కంబమును యాదస్స్వామి మంథించు మం
థానాదిధ్వంబురుడించుచుం బురము క్షుబ్ధక్షుబ్ధముం జేయఁగా
దీనాలాపవిదీర్ణమానసుఁడు మంత్రిప్రేషితుండా యవం
తీనాథం డలవత్సరాజుకడ కేతెంచుం బరిభ్రాంతుఁడై. ౩౧౪

చనుదెంచి సత్వరంబుగ
ననన్యగతియాట తేనిఁ బ్రార్థించును వే
గను నానడగిరి మదవా
రణమును వశపఱచికొనియు రక్షింపఁ బురిన్. ౩౧౫

అట్లు ప్రార్థించి కారాగృహంబునుండి
ముక్తుఁ గావించుఁ దప్పక భూమినాథు;
"నందినం జుట్టుఁ; బట్టుఁ గాళ్లంద కున్నఁ"
బనివడిన వాఁడు కర్మ్యా ర్తిపడఁ డెవండు? ౩౧౬

మన యేలినవా రద్దా
నిని వీణాసాహ్యమునను నిలిపి వశతఁ దా
నను గూర్చుండియ యెల్లరుఁ
గనుచుండఁగఁ బఱవవలయుఁ గౌశాంబి కొగిన్. ౩౧౭

గజతంత్రింబును బన్నిన
ప్రిజాధినాథున కొనర్పఁ బ్రాయశ్చిత్తిన్
గజతంత్రింబునె మనమును
సృజియింపఁగ వలయు; దీనఁ జేకురు మేళుల్. ౩౧౮

నడగిరి మావటీనికి ధనం బొకలక్ష యొసంగి వానిచే
బెడిదపు పిచ్చిమందుఁ దినిపింపఁ బ్రియత్న మొనర్పఁగావలెన్
అడరును గార్యసిద్ధియది యట్లగునేన్; "ధనమూలమిా జగం"
బొడమినిఁ జూపఁగొండపయినుండినకోఁతియు డిగ్గుఁగ్రిందికిన్.

అని పలుక రుమణ్వంతుని
మనమున కాయుక్తి నచ్చి "మంచిది మేల్మే"
లని తన యంగీకారం
బును దెలిపె; వసఁతకుండు మోవిని విఱిచెన్. ౩౨౦

విఱిచి వచించె నిట్టులు; వివేకయుతంబగు నీదుయుక్తికిం
బరమ ముదంబు గాంచితిని; వాసవదత్త కటాక్షమాలికా
గురుతర శృంఖలాతతుల గుప్తముగా బిగియించి వత్స భూ
వరుఁ జెఱవెట్టి యుంచె విరిపాన్పున బంగరు మేడలోపలన్.
క్షణకాలంబట నేను ముచ్చటలతో స్వామిభర్తతోనుండఁ గం
కణమంజీరరవాఖ్యమంత్రిముల నాకర్షించు నాఁటేని; నే
మణిమంత్రౌషధసిద్ధు లాయువతి సంపాదించెనో? రాజ ను
క్షణ మాసుందరి క్రీతదాసుఁడయి సంచారంబు సేయుంజుఁడీ!.

తెక తేరఁగ దొరికినయా
సకునిం బీయూషపాత్ర చందంబునఁ గా
తుకమునను నెంతగ్రోలిన
నొకింతయును మొకము మొత్తకున్నది సకికీ. ౩౨౩

మనరాజు చిక్కియుండెను
వనితామణి తనువిలాసపద్మవ్యూహం
బునఁ బార్థపుత్త్రి చందం
బునఁ; దప్పించెడు ప్రవీరపురుషులు గలరే! ౩౧౪

మనయేలిక నాప్రద్యో
తుని చెఱఁదప్పింపవచ్చుఁ; దొయ్యలి చెఱనే
యనువునఁ దప్పింపందగు?
జనుఁడెట్టులు కొమ్మవిడిచిదుఃఖ్మాజముఁ దెచ్చున్? ౩౧౫

కాన వాసవదత్తాఖ్యమైన చెఱనె
వెల్లగిలఁజేసి కొంపోవఁ జెల్లుమనకు;
దాని కనుకూలమైన తంత్రంబు వన్ను
మట్లు గాకున్న మనకార్య మగుట కల్ల. ౩౧౬

అని యుపన్యసింప యౌగంధరాయణుం
డాలకించి జేని నాత్మ రోసెఁ
దనుఁ బరాభవించు ధరణీశునకు లోఁగి
తగిలియుంట నతని తనయనిట్లు. ౩౧౭

ఐనన్ స్వామిహితుండు గావుట నమాత్యశ్రేష్ఠుఁ డిట్లాడె; న
క్లైనన్ వాసవదత్తతోడ మనవత్సేశుణ్ హరింతున్నిగో,
గ్లానుం జంద్రికతోడనుంబలెనె; యిక్కార్యంబు సిద్ధింపదే
నేనీవేసముతోడనే తిరుగుదున్ జీనచ్ఛవంబై యిఁకన్. ౩౧౮

అనిమరలఁ బ్రతిజ్ఞంగొని
యును దలఁచినగతి నడగిరి కున్మాదముఁ గూ
ర్చినవే ద్వితీయకార్యం
బనుకూలంపడు నటంచు ననుకొనె నెడఁదన్. ౩౧౯

కాకులు కూయఁదొడంగెను
శాకాలువినంగఁబడియెఁ బ్రద్యోతనృప
ప్రాకార ప్రాంతంబున
వ్యాకులపడివారు పఱచి రా యా దెసకున్. 330

౯

శ్రీరామాపరమూర్తీ !
వారిధిగంభీర ! కీర్తివల్లరికా ధా
త్రీరుహావర ! వేంకట రా
మారెడ్డీ ! యవధరింపుమా ! పైని కథన్. 331

అనుకొన్నట్టులు మావటీనికిని దవ్యంబిచ్చి పట్టంపు టే
నుఁగున కున్మాదకరంపువస్తువితతిన్ నూరించి కట్టించి ము
ద్దను బెట్టించె స్వయంబుగాఁ; గరియు నత్యంతంబు స్వాదిష్ఠమా
టను వెన్కాడక జిహ్వాతృప్తుడులవేడ్కన్ మ్రింగె నద్దానినిన్.

మెల మెల్లఁ బ్రకోపించెను
దలలోఁ బిత్తంబు కరికిఁ; దానవవశమై
చెలఁరేఁగి గీఁక వెట్టుచు
గలగలమనఁ గాలిగొలుసు కంబము వెఱికెన్. 333

మొదలనది మదపుటేనుఁగు
మదియింపఁగ మరియు మరియు మందిడిరి; యికన్
వదియింపఁగఁ దర మగునే?
తదీయమగు పలువిధముల దారుణచర్యల్? 334

ప్రళయకాలమునందుఁ బర్వతంబుల దున్ను
దుర్దాంతమగు కాలుదుంత యనఁగ;
లోకసామగ్రినిఁ జీకాకు పఱచుచుఁ
గడు రేఁగినట్టి భూకంప మనఁగఁ;
దీండ్రించి భువనముల్ గుండ్రించి యొకతూరి
బోర్లించు నొక మహాభూత మనఁగఁ;
దాండవింపంగ నుద్దండత నేతెంచు
నా మృత్యుదేవి వాహన మనంగఁ;
బిండలిం గొన్న కీడులపిం డనంగఁ;
గ్రిందుకొని వచ్చు నా కాళరాత్రి యనఁగఁ;
గొఱలి విహరించు పాతాళ గుహ యనంగ;
నా నడాగిరి జృంభించె నప్పురమున. ౩౩౫

విఱుచుం బూచికపుల్లలం బలె మహావృక్ష ప్రకాండంబులన్,
బెఱుకుం దామరతూండ్లచందమునఁ దద్వ్యాధ్యాయన స్తంభముల్,
చెఱచున్ మేడల మిద్దెలం గృహముల్ శృంగారపుందోటలన్,
అఱచున్ స్ఫూర్జథుఘోషముం బెరయుచున్నా దంతిదుర్దాంతమై

వీడిన మొలనూలు పెనుకాలిబందమై
పఱచుచుం బఱచుచుం బడెడివారు
చంకలో నిడుకొన్న చంటిబిడ్డలతోడ
దిగ్భ్రాంతి నట్టిట్టు తిరుగువారు
ఎదురై నతటి నెట్లొ యెగిరి గోడలుదాటి
పరులయిండులఁ జొరం బడెడివారు
దవ్వులం గాంచియుఁ గెవ్వున నఱచుచుఁ
బడుచు జాఱుచుఁ జెట్లఁ బ్రాఁకువారు

సగము సడలిన చీరలు సరుదుకొనుచు
నొకట నాఁగుచు నాఁగుచు నూర్చుకొనుచు
బలమఱుట గాళ్ళ మెలమెల్లఁ బఱచువారు
నయిరి పురకాంత లత్తఱి నాత్మఁగలఁగి. ౩౩౭

కూడిరాలేనట్టి మూఁడుకాళ్ళముసళ్ళ
వారి కర్మమునకు వదలివైచి
తొరతొర తమతోడఁ బఱవఁజాలని బాల
కుల నీడ్చుకొంచు ఱెక్కలనుబట్టి
"నటువచ్చె నిటువచ్చె నది"యన్న కేకతో
వెనుకవచ్చెడి స్వీయజనుల మఱచి
"యిటురండు; కాదు కాదటు రం"డటని తోఁచ
కెటువైపు నొండొండ్ల కెదురుపాఱి
ఒకరి కడ్డంబు పర్వెత్తి, యొకరు వడియుఁ,
బడిన వారిపై నుండియె పరువు లిడియుఁ,
గని కిరాతునిఁబఱచు మృగంబు లట్లు;
పౌరు లందఱు చిందరవంద రైరి. ౩౩౮

పొత్తిగుడ్డలలోనఁ బొదిగిన నెలపాప
జాఱిపో బిట్టేడ్చుఁ జాన యొకతె
తన రత్నహారంబుఁ దునిచి కొంపో దొంగ
కడుఁగడుం దపియించుఁ బడఁతి యొకతె
కురులమొత్తము చెట్లకొమ్మలంజిక్కి మి
క్కిలి గొట్టుకొనుచుండుఁ గలికి యొకతె
తన వలపులపంట కనరామి లేఁడిచూ
పులఁ గాంచు చఱచును వెలఁది యొకతె

దాఁగినట్టిచోట దయ్యంబు పట్టిన
కరణిఁ దన్నుఁజెనఁటి చెలువరాఁగఁ
బఱచు వెలఁదియొకతె వాపోవు చివ్విధి
నలజడించె నప్పు డాపురంబు. ౩౩౯

పరిజల పాటుఁ గాంచి పరిద్యోతుఁ డప్పుడు
పిలిచి సచివు నతఁడు దెలిపి నట్లు
వత్సరాజు డాసి ప్రార్థించెఁ గేల్మోడ్చి
మొగిచి తోలఁగఁ జేయఁ బురము బెడఁద. ౩౪౦

తను వంచించిన ప్రద్యో
తుని పైఁగల కినుక మెల్లఁ దొయ్యాలి కతన౯
వెనుకం బడుటను నుదయనుఁ
డనుకంప వహించె వాని యాందోళనకు౯. ౩౪౧

చనుచున్న ప్రియుని నెమ్మో
మునఁ గుంకుమ తిలకముంచి పువ్వుఁబోఁడి యెదు
ర్చనుదెంచి వానిక్షేమం
బునకై ముక్కోటి వేలుపుల మొ్రిక్కు కొనె౯. ౩౪౨

కారాగారము వీడి ఘోషవతి స్వస్కంధంబునం గ్రాలఁగాఁ,
బారవారితము పాయవిచ్చియిడఁ దోర్వ౯, వత్సధాత్రీ సునా
శీరుం డల్లన రాజవీథిఁ జని, కాంచె౯ వింధ్య శృంగంబు నా
కారంబొందిన యానడాగిరిని నుగ్రింపశ్యము౯ ముంగట౯.

చాలం దానిఁగాంచి ఘోషవతి వత్సక్ష్మావరేందు రిందు గీ
తాలాపంబునొనర్పఁబూనెఁగడు ప్రశావ్యత్వంబునొల్కించు చున్
ఓలిం దద్ధ్వని శ్రోత్రపేయమయి యత్యుత్సాహముం గొల్ప న
వ్వేళం దర్పముదక్కి దంతినిలిచె౯ విచ్చేసి రాట్సన్నిధి౯. ౩౪౪

ముంగాళ్లం బయికెత్తినిల్చు;నడచుక ముక్కాలితో; బోరగి
ల్లంగాఁజేసియొడల్ పరుండుకొను; నేలం బిట్టు పొర్లాడుఁ; బె
ట్టుంగీఁకల్ పయికెత్తితుండమును; జుట్టుక విప్పుఁ బల్మారు దా
నిం; గోత్రాపతి యానతిచ్చిన గతిం జేసెగజం బత్తఱిం.
కోలఁజూపి యల్లకోఁతి నాడించిన
పగిది నతఁడు మత్త వారణమును
ఘోషవతిని మీటి కొమరుగా నాడించె
నక్కజంపడంగ నచటి జనులు 3౮౬
ఆగజమెక్కి వత్సపతి యాపుర వీథులయందు నిచ్చ నూ
రేఁగఁదొడంగెఁ; బౌరు లానదించుజయధ్వని నిండఁగా వియ
ద్భాగమునందుఁ, గన్నులువదండలఁ దోరణగట్టి సుందరుల్
యోగిగృహాంగణంబులను బువ్వులఁజల్లుచునుండఁ బేర్మిమై.
ఇట్లు మదమడించి యేనుంగు మచ్చిక
పఱచి వత్సరాజు మఱలి వచ్చె
నా యవంతి విభుఁడు స్వాగతం బర్పింప
సచివ ముఖ్యబంధు జనులతోడ. 3౮౭.
ఎంతగా మదించె నంతగా శాంతిల్లె
మదగజంబు తేని మహిమ కతన
వినము; కనము మనము; వీణియ పాటకు
నింత మంత్రశక్తి యొసఁగు ననుచు. 3౮౮

శ్రీ రమణీ నిలయాయిత
చారుముఖాంభోజ! సరససాహిత్యకళా
సారజ్ఞా! వేంకట రా
మా రెడ్డీ! యాలకింపుమా! యవలికథన్. ౩౯౦

తనరాజు తన్నడాగిరి
తనకు వశంవద మొనర్చి దయసేయఁగఁ గ్రొ
న్ననఁబోఁడి నిలిచి వాఁకిట
ననర్ఘ నీరాజనంబు లర్పించెఁ దమిన్. ౩౯౧

పురమున నూరేఁగెడు న
త్తఱి నాసుందరుల దృష్టి తాఁకెనో? యనుచున్
వెఱపుగొని సురాళించెను;
గరముష్టుల నొక్కఁ దనదుకణఁతలఁ బ్రీతిన్. ౩౯౨

ఇనుమడించిన వలపుతో నిగురుఁబోఁడి
యల్ల వత్సేశ్వరుండు నన్యోన్య బాహు
పంజరములందుఁ జిక్కి యపారమైన
హర్షవార్నిధియందు నోలాడుకొనిరి. ౩౯౩

తనపురపీడఁ దీఱిచి ముదంబిడి పౌరజనానురాగముం
దన తనయానురాగము నితాంతము చూఱలు గొన్నతేని బం
ధనమున నుంపరాదిది కృతఘ్నతయంచు నెదం దలంచి యు
జ్జని ఱేఁడయందు వానిఁ బరసౌధమునన్ విడియించె స్వేచ్ఛగన్.

కాని,పట్నంబు విడనాడి యానరేంద్రుఁ
డెందుఁ బజవక యుండంగ నెల్లలందు
గట్టి మెఱియలవంటి పెక్కండ్రు భటుల
నుక్కుగోడయొ నాఁగఁగాఁపుంచె నతఁడు. 3౫౪

తనమంత్రంబు యథాకృతంబుగను సిద్ధంబౌట యాగంధరా
యణుఁడానందమునొంది క్రమ్మఱనుమంత్రాంగంబుసాఁగించియం
తను గౌశాంబిని నున్నదూతల రవాణాచేసి పెక్కండ్రు ను
జ్జనిపట్నంబుననుంచెఁగాపురముఁ బ్రచ్ఛన్నంపు వేషంబుతోఁ.
కొలువునఁబెట్టె దూతలను గొందఱమంత్రులయొద్దఁ;గొందఱ
నిలిపెనుజేనియంతిపురినిం;బురిలోఁగల పెద్ద ద్రవ్యవం
తులకడలెక్క వ్రాఁతలకు దూర్చెనుగొందఱ; మెల్లసేనలోఁ
బలువురఁజేర్చె; నివ్విధి నవంతిని నింపెను స్వీయకోటితోఁ.
అవసరము వచ్చినపు డా
యవంతి సైన్యం బెదుర్చునట్లు కడు మెలం
కువతో వర్తిలఁ జేయుచు
నవలోకించుచును బైని నాతంౘుండెన్. 3౫౭

సందీయకుండఁ బరులకు
నందఱుభటు లప్రమత్తులై సచివుని యా
జ్ఞం దగ సుగ్రీవాజ్ఞగ
డెందంబునఁ దలఁచి నివ్వటిల్లఁగ నున్నన్. 3౫౯

వలసిన జతనము లన్నియు
సలుపంబడ నొక్కనాఁడు క్ష్మాపతితోడం
దెలుపఁగఁ బ్రయనముఁ గూర్చి
పిలిచి వసంతకుని మంత్రి పిలుచం బనిచెన్. 3౬౦

చని వసంతకుండు సరవి నివేదించి
వత్సరాజుతోడ వార్త లెల్లఁ
"బయన మగుము నీదు వలపుల రాణితో
రేపు రే" యటంచుఁ బ్రీతి నొడివె. ౩౬౧

గురుఁడైన వత్సపతి శి
ష్యురాలి కుపదేశ మిచ్చెఁ జొప్పడఁ దనతోఁ
బురికిఁ బలాయన మంత్రము
సరవిం బాఠంబు ముగియు సమయమునందున్. ౩౬౨

ప్రియుపల్కుల్ వినినంతనే యువతి యుద్వేగంబునన్ మున్గి "యే
క్రియమాతాపితలంద్యజింపవలె? నీ కృత్యంబునన్ నన్గృత
ఘ్నయయంచెంచరె? నెయ్యుతో నెటులుపోకన్ మానుదున్?
జూడఁగా
నుయియున్ ముంగట వెన్క గొయ్యి యయి యాందోళించు
చుండెన్ మదిన్. ౩౬౩

చెప్పిన ముప్పగుఁ దప్పక;
చెప్పకయుండినను దప్పుసేయుటయ యగున్;
అప్పితరులపైఁ బ్రీతిని
మొప్పముఁ దన ప్రియుకుఁ గూర్పఁ బొలఁతికిఁ జన్నే? ౩౬౪

కొలఁది తడ విట్లు మదిలోఁ
గలంగి ప్రియువెంబడింపఁగా స్థిరపఱచెన్
"దలిదండ్రు లల్లముగనుం
జెలువుఁడు బెల్లముగ నగును" జెలువకుఁ దుదికిన్. ౩౬౫

తనుఁబెంచి పువ్వనుం బలెఁ
దనపైఁ బ్రాణంబు లైదు దగ నిలిపిన త
జ్జననీ జనకులఁ దుది విడి
తన పతితోఁ బాఱిపోవఁ దరుణి దలంచెన్. ౩౬౬

౧౧

శ్రీమత్సరస్వతీ దే
వీమందిరభూతరసన! విద్యాభోజా!
ధీ మహిమాన్విత! వేంకట
రామారెడ్డీ! యనంతర కథన్ వినుమా! ౩౬౭

మఱునాఁ డర్ధమరేయి నాయుదయన క్ష్మాపాలుసౌధంబు ముం
దఱ శ్రీవాసవదత్త యెక్కుకరిణిం దద్గాఢ చారుండు ది
ట్టరి మాష్టీఁడు స్వమంత్రిచేత నుపదిష్టంబైన మార్గంబునన్
సరవిన్ నిల్పుడు నూత్నదంపతులు తత్సంబేరమారూఢులై.

చని యెల్లందఱెయంగ నుజ్జయిని రాజ్యైన్యంబు గుర్తించి వ
త్సనృపాలుండని యడ్డగించుటయు దృష్టంబై మహీజాని వె
న్కనుదదక్షకు వచ్చుగూఢపృతనా చక్రంబు బాగిన్ ముట్టిమా
ర్కొనె; నష్టాయిరువాఁగులుంగలియ గగ్గోల్వాటె నుచ్చైర్గతిన్.

త్వరితగతిం జాఘూలురు
పరుగిడి కొని వచ్చి యెఱుక పఱచిరి మంత్రీ
శ్వరులగు శాలంకాయన
ధరణీందుప్రల దగ్గఱించి తదుదంతంబున్. ౩౭౦

వారు నిర్ఘాంతపడి మూలబలము లేచి
వత్సపతి సైన్యమును వెన్కవైపునుండి
ముట్టి యడకొత్తులోని పోటకట్టు నలంప
నంపిర మ్మొనకాండ్రకు నాన తిచ్చి. ३२౧

అల్ల మూల సైన్య మావత్సపతి సైన్య
ములను డాయ నొక్క మొగినిఁ దిరిగి
దానినుండి పెక్కు దండివాఁడిమగండ్రు
మూలబలముతోన పోరుచుండి రి. ३२౨

తమ తమ వారని నమ్మిన
సమరభటుల్ మొనసి వత్సజనపతి వాండ్రై
తమతోఁ గలియంబడ ది
గ్భ్రమగొని మొనగాండ్రు తోఁచకయ నిల్చిరటన్. ३२३

మునుమున్నె యటకుఁ గౌశాం
బినుండి తమసచివునాజ్ఞ విచ్చేసిన య
మ్మొన ప్రద్యోతుని పరి డీ
కొని తప్పింపంగ లేఁడు గొబ్బునఁ బటిచెన్. ३२४

పదిరెట్లుగఁ గానంబడె
నుదయను సైన్యంబు; గాంచుచుండిన మొనగాం
డ్రిదియేఁ మని ముక్కున వ్రే
ల్గదించుకొని తెల్లవోయి కనుచుండి రటన్. ३२५

జాగరూకత నున్న వత్సపతిసేన
మొలి నిద్రాళువులును దండ్రాళువులును
నయిన పరసేన జొకొట్టి యయ్యెదనునఁ
బెద నిద్దురఁ బుచ్చెను బెక్కుమంది. ३२६

కరవాలంబులు దాలిచి
యటెదిగ యౌగంధరాయణాదులు ముగురున్
దొరతొర ఢాకిరి యాపగ
తురసైన్యములోని కవుకు తుందుడుకు మెఱయున్. ౩౭౭

తేని దారి తేడు రివ్వున బఱచి కౌ
శాంబి చేరె నాగజ బుపైని
భద్రముగను దనదు వాసవదత్తతో
స్వాగతం బొసంగ పౌరజనులు. ౩౭౮

తమ తేని పోకఁగని సై
న్యములుం దద్గాఢభటులు నాతని వెనుకం
గ్రమముగ బరుగిడిపోయిరి
సమరభువిన్ విడిచి యతని సంరక్షణకై. ౩౭౯

అనవద్యంబగు విక్రమంబొలయ సింహంబట్లు యౌగంధరా
యణుఁడా శాత్రవసైన్యకుంజర సమూహంబందు లంఘించి బి
ట్టనిదంపూర్వము; నక్షతంబుగను; జేయన్ యుద్ధ''మంతం బలా
యనమంత్రంబువరించి''రాపరభటుల్ హాహాక్రియారంభులై.

తఱుమఁబడి వారు మరలం
దిరుగంబడి మరలఁ బఱచి తిరిగియు మరలం
జిరమిట్లు పోర సచివుని
కరాసి తుది విఱిగిపడియె క్ష్మాతలమందున్. ౩౮౧

అదను చిక్కెనంచు నా శూరు లందఱు
కూడి వానిఁ బట్టికొనిరి డాసి
కట్టులేనివాని గొట్టియే కఱవంగ
ఖడ్గహీనుఁ బరులుగాడ్పెఱుపరె? ౩౮౨

పయి కున్మత్తుఁడు; సమర
క్రియకుం బ్రార్థుండనం జరించు నతని ను
జ్జయినీశుని వీరావళి
కయిదోఁబెడవిఱిచి యంటఁగట్టి రలుకతోఁ. ౩౮౩

పురవీథిం గొనిపోవఁగాఁ బడెడు నా మూర్తిం బరీక్షించి చూ
పఱితం డిప్పటిదాఁక "వీఁడెడి గతిఁ"వర్తిల్లుచుఁ "వీఁడై"
పరగెఁ నేఁ; డెవఁడీ ధురంధరుఁడు?"పైపైఁజూడఁజుం చెల్కుయుం
బరికింపంగనుబందికొక్కను గతిఁ" భాసిల్లె నం చెన్నుచుఁ.

వెఱగుపడి మేము మేమని
విఱుగంబడి కాఁడు వీఁడు వీఁడెడి మమ్మం
దఱ వీఁడెడులం జేసి, ని
గురు కప్పిన నిప్పువోలె గురుఁడో? యేమో? ౩౮౪

అద్భుతక్రియుండు యౌగంధరాయణుం
డేమొ? కాక భువిని నిట్టి తెలివి
పరుల కేలవచ్చుఁ? బడయునే యశ్వంబు
గతిని దుంత జన్మశతములకును? ౩౮౫

అనుకొనుచునుండ నాతనిఁ
గొనిపోయి యవంతివిభునిఁ గొలువున నుంచెఁ
జనపాలమంత్రిముఖ్యులు
కని యాతని వెఱ్ఱివాలకం బడిగి రిటుల్. ౩౮౬

"ఈ వెంగలి వేసంబున
నీ వీఁటం దిరుగుచున్న యీ వెవఁడవురా?
జీవములతోడఁ జనుదువె?"
నావిని యవ్వెడఁగుమంత్రి నవ్వుచుఁ బలికెఁ. ౩౮౭

మునుమాయేలిక మోసగించినమిమ్ముఁ మోసంబునఁ ముంచి; రా
ట్తనయారత్నముతోడ మా ప్రభువరుం దప్పించి కొంపోఁ బ్రతి
జ్ఞను గావించి తరించినట్టిఁడను; బ్రజ్ఞాశాలి యౌగంధరా
యణుఁడఁ మిమ్ము వెడంగులఁ సలుపఁగా నైతిఁ వెడంగంజూఁడీ!

కరికిని వెఱ్ఱెత్తించితిఁ;
జెఱఁదప్పించితిని రాజసింహమునకు; మా
చరగణమున నించితి మీ
పురమును; గౌశాంబినాఁగఁ బొనరించితిఁ బో! ౩౯౦

తఱిమితిఁ; దుఱిమితి మీపరిఁ
బరిపరివిధములను; దుదికిఁ బట్టువడితి; మీ
కరముల నాకరవాలము
విఱుగుటఁ; గాకున్న నాదుబీరము తెలియుఁ. ౩౯౧

"నక్క చన్న వెనుక బొక్కఁగొట్టిన యట్లు"
పఱవ తేఁడు నన్నుఁ బట్టినారు;
వర్ణనీయమగును బ్రద్యోతమంత్రుల
తెలివి తేఁట లిట్లు తెల్లవాఱె." ౩౯౨

విని దీనిమంత్రు లెల్లరు
మునింగి యాశ్చర్యవార్ధి మోములు గనుగొం
చును నొండొరువులు సిగ్గునఁ
గన జాలకపోయి రెదుటఁగల యామంత్రిఁ. ౩౯౩

వెక్కిరింపఁబోయి వెలికిలఁ బడట్లు;
ముంచఁబోయి తార మునిఁగి నట్లు;
బెడిసికొట్టఁ దమదు వేసిన మంత్రంబు
కొలఁది కాలమట్ల కూలఁబడిరి. ౩౯౪

విధిలే కా ప్రద్యోతుఁడు
క్రుధనుం దిగ్రమింగి యెదురుకొని తనయల్లుం
గ్రుద్ధితునిఁ జేయుట తగ దని
ప్రధానులకు సెలవొసంగె వానిని వదలన్. ౩౯౫

వదలి వానిస్వామిభక్తికి మెచ్చిన
యట్లొసంగెఁ బెక్కుపాయనములు
పరిభువుఁగాంచి మంత్రివర్గంబు యౌగంధ
రాయణునకు నాదరం బొనర్చె. ౩౯౬

తదుపరి యా సచివోత్తము
నెదుటనె పరిణయ మొనర్చె నెంతయుఁ బ్రీతిన్
ఉదయన వాసవదత్తా
మదిరాక్షులచిత్రములకు త్మొంధవుఁ డచటన్. ౩౯౭

తనజామాతకుఁ బుత్రికామణికి రత్నస్వర్ణ నానా విభూ
షణముల్ సుందరవస్తువాహన సహస్రింబుల్ దుకూలంబులం
దన దగ్గా కుచితంపుఁగానుకల నాతండిచ్చి యౌగంధరా
యణుతో మంత్రిజనంబుతోఁబనిచె; సాహ్లాదంబు కౌశాంబికిన్.

వత్సరాజవరుఁడు; వాసవదత్తయు;
వచ్చినట్టి మంత్రివర్గమునకు
స్వాగతం బొసంగి సత్కరించిరి; తొంటి
శత్రు లిపుడు పాణిమిత్రు లయిరి. ౩౯౯

శ్రీసుకవి పికవసంతా!
దాసీకృత శత్రుజాల! దానకృత యశో
భాసుర! వేంకటరామా!
ఆసక్తిని నవధరింపుమా! యవలికథన్. ౪౦౦

అత్తటి మొదలనె సచివా
యత్తుం డగు నుదయనుఁడు తదాదిగ మరియుం
జిత్తవినోదిని వాసవ
దత్తా సుందరికిఁ గ్రీత దాసుం డయ్యెన్. ౪౦౧

మదిరారసంబు కైవడి
మదిరాక్షి మదంబు గూర్ప, మానసమున కా
యుదయనుఁడు పరవశుండయి
త్రిదివం బొనరించి యాత్మగృహము సుఖించెన్. ౪౦౨

ఇది పవ; లియ్యది రాతిరి;
యిది యుదయం; బిద్ది సాయ; మిదియిది; యంచున్
మది నెఱుఁగక సంతత మా
యుదయనుఁ డా యువతి గోష్ఠి నుబ్బుచు నుండున్. ౪౦౩

తమ శైష్యోపాధ్యాయిక
సమయంబున నడిచినట్టి సంకథలను, జి
త్రములఁ దగఁ జెప్పికొనుచుం
బ్రమోదపడు చా యుగంబు వర్తిలు చుండెన్. ౪౦౪

వీనులవిందుగా వీణెమీటఁగఁ బతి,
లలన ముద్దుగను దాళములు వేయు;
హృద్యంబుగా వ్రాయఁ బ్రియుఁడు చిత్తర్వును,
గోమలి తగిన రంగులను దిద్దుఁ;
కౌశలంబున మృదంగము భర్త వాయింప,
నా వన్నెలాడి లాస్యం బొనర్చుఁ;
బాడుచుం బాడు చాపాటఁప ననుఁగుకాఁ,
డామనోహరి దాని నంది పాడు;

చదువ శృంగార కావ్యంబు సరసుఁ డెలమి,
యువతి విరచించును దదర్థ వివరణంబు;
పై నుదాహృత కార్యముల్ వ్యత్యయముగ
వారు గావించు కొం డొక్క తూరిప్రీతి. ౪౦౫

నా తెఱ విందులుఁ; గౌఁగిళు;
లోతప్రోతములు; మోహ మొలికెడు ముద్దుల్;
ద్యూత క్రీడల లోపల
నా తరుణీ తరుణు లొడ్డు నట్టి ధనంబుల్. ౪౦౬

పతియాటను గట్టించుచుఁ
జతురంగ క్రీడలందు సతి "విజితుండా
పతికిన్ మిండండు గదా
సతి" యనుచును బిట్టు నవ్వి సరసము లాడున్. ౪౦౭

ఆతండు పూలరంగం;
డాతన్వి వసంతలక్ష్మి; యా యిరువురి లో
కాతిగ దాంపత్యమునకుఁ
జేతులు సాఁచుదురు సుండు జేజే కవులున్. ౪౦౮

కేళాకూళల నాచరించుచు జలక్రీడల్, పువ్వుందోటలన్
దోలల్ దూఁగుచు, నాకుటీరములఁ గంతు క్రీడలం దేలుచున్,
లీలం జెక్కునుజెక్కు రాచుకొనుచున్, నెయ్యంబులొల్కంగ వా
హ్యాళిం బోవుచుఁ, గేళికాద్రులఁ దగెన్ హ్నద్వంద్వమద్వంద్వమై.
గురుఁడై ప్రిపథమంబున
మరుఁడై దివసక్రమమున మరి, నమృతంపుం
గరుడై తదుపరి, తుదికిని
వరుఁడై మెలయించె తేఁడు వాసవదత్తన్. ౪౧౦



ఆ వత్సరాజు వోలెను
శ్రీ వేంకట రామిరెడ్డి సెలఁగుచుఁ దనదా
దేవేరితోడ సుఖముల
తో వర్ధిలుఁ గాక! యితఇతోధిక రీతిన్.



## శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి కృత ముద్రితగ్రంథములు.

౧. జాతకకథాగుచ్ఛము (ప్రథమ భాగము) వెల ౧ ౮ ౦
(ఆంధ్ర, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయములచే పాఠ్యముగా నిర్ణీతమైనది)

౨. జాతకకథాగుచ్ఛము (ద్వితీయ భాగము) ౧ ౮ ౦
మద్రాసు విశ్వవిద్యాలయ విద్వాన్ B కి పాఠ్యము.

3. కీరసందేశము—ద్వంద్వయుద్ధము. ౧ ౪ ౦
(మద్రాసు విశ్వవిద్యాలయముచే పాఠ్యముగా నిర్ణీతము)

౪. గోవర్ధనాచార్య సప్తశతీసారము (శృంగారము) ౧ ౦ ౦

౫. పువ్వులతోఁట (ఖండకావ్యములు) ౦ ౮ ౦

౬. కావ్యమంజరి ,, ౦ ౮ ౦

౭. నడుమంత్రపు సిరి (అధిక్షేపకావ్యము) ౦ ౮ ౦

౮. ఖడ్గతిక్కన ౦ ౧౨ ౦

౯. అమృతకణములు (శృంగారము) ౦ ౮ ౦

౧౦. వాసవదత్త ౧ ౦ ౦

౧౧. తత్సమచంద్రిక (వ్యాకరణము) ౪ ౦ ౦

భట్టోజీదీక్షితవిరచిత మగు వైయాకరణ సిద్ధాంతకౌముదీస్థితములగు సంధి, సమాస, సమాసాశ్రయవిధి, స్త్రీప్రత్యయ కృత్తద్ధితభాగములనుండియు, కాశికా మాధవీయధాతువృత్తి, గణరత్నమహోదధి, మహాభాష్యము మొదలగు పెక్కువ్యాకరణ గ్రంథములనుండియు నాంధ్రభాషకుఁ గావలసినంత విషయముద్ధరించి వ్రాయఁబడిన మహాగ్రంథము.

## అముద్రితములు.

౧. డిత్థడవిత్థోపాఖ్యానము (అధిక్షేపకావ్యము)

౨. వ్యాసకోశము

3. సరసభూపాలీయము ౪ ౦ ౦

సవ్యాఖ్యానము. పెక్కుతాళపత్త్రి గ్రంథములనుండి పాఠాంతరములు గ్రహింపఁబడియున్నవి. సంస్కృతాలంకార గ్రంథములందలి యెల్ల విషయములును, ఆంగ్లాలంకార గ్రంథములందలి యెల్లవిషయములును సందర్భానుసారముగా నిందుదాహరింపఁబడి యున్నవి.